# మైదానం

గుడిపాటి వెంకటచలం



1938



[వెల రు 0—8—0



# మైదానం

## I

'లేచిపోయినా'నంటే యెవరన్నా నన్ను, నాకెంతో కష్టంగా వుంటుంది. ఇదివరకంతా యీ మనుష్యుల్లోంచి, నీతివర్తనులలోంచి వెళ్ళిపోయి, యెడారిలో జీవించడంవల్ల నేను చేసినపని ఘోరత్వం, నీచత్వం బోధపడలేదు. ఆ జీవితమంతా సుందరమైన, దివ్యమైన స్వప్నంవలె, ఆయెడారి పుణ్యభూమివలె, నాజీవితంలో యీశ్వరుడికి నే నెత్తే మంగళహారతివలె తోచింది. ఇంటినే, బంధువుల్నే, భర్తనే మరిపించగల అనుభవం యెంత వున్నతమో, అద్భుతమో నువ్వే ఆలోచించు. అమీర్‌నీ, మీరానీ అనుభవించిన తరవాత, మనచుట్టూ బతికే యీ పల్లెజనులందరూ పురుషులేనా, మనుష్యులేనా అనిపిస్తుంది నాకు. నేను బండిదిగేప్పుడు వీళ్ళు చుట్టూపోగై,

"లేచిపోయిందిట్రా."
"చాలా బావుందిరా మనిషి!"
"కావలసిందే శాస్తి ముండకి"

అంటూవుంటే అర్థమయింది నాకు లోకమార్గం. చివరికి నువ్వూ అన్నావు 'లేచిపోవడానికి నీ భర్తలోప మేమన్నా వుందా?' అని. ఆయన్నెరుగుదువుగా? అమీర్నే, నాకు కనపడకపోతే యీనాటికి యింకా నా పెనిమిటితో కాపరం సుఖంగా, మత్తుగా చేస్తో పడివుండేదాన్నే. అమీర్‌తో నీకో, యింకో పతివ్రతకో స్నేహమేవుంటే, మీరూ లేచిపోయే వుందురు, అతని ఆకర్షణాన్ని నిగ్రహించలేక. మీరూ నేనూ కాము జవాబుదారీ దానికి. వొప్పుకోవూ? మీ కెవరూ లేచిపోయివుండరూ? నీమాటే నిజమేమో? ఆ ఆకర్షణ అర్థమయ్యే హృదయం వుండా

లేకడ. కాని మహాప్రాణ్ణాపు సోమిరిగాని నన్ను తాకితే యొళ్లు ఝల్లుమనే నాకు అమీరు దినాలపక్కన పొత్తుకి స్వర్గంగా అర్థంకాకుండా వుండ గలదా? పోనీండి, మీరే అస్పష్టంచుకులేమో! తగాదా యెందుకు?

ఒకనాటి పొద్దున్న, ఆయనతో యేదో వ్యాజ్యంవిషయమై మాట్లా డ్డానికి వొచ్చాడు అమీర్. ఆఫీసుగదిలో యేమీమాటలు వినబడకపోతే; యెవరూ లేరనుకొని కాఫీ లోపలికి తీసికెళ్ళాను. ఆయనముఖం చూడ గానే గదిలో యింకా యెవరో వున్నారని గ్రహించి వెనక్కి వెళ్లడానికి చప్పున తిరిగిపోతూవుండగానే, యీలోపునే యెవరో గాఢంగా నా వీపుని చూపులతో స్పృశిస్తున్నట్లు తోచింది. అతనివంక పూర్తిగా కళ్లెత్తైనా యెత్తకుండా లోపలికి వెళ్ళిపోయినాను. కాని ఆచూపు నా వీపునచేసిన గాయంమాత్రం నన్ను రోజల్లా బాధపెట్టింది. మర్నాడు సాయంత్రం మామూలుగా నేను దొడ్డిగుమ్మంలో నుంచుని వుండగా, మళ్లా ఆ చూపే నావంపుకి తగిలి, తిరిగి, అతన్ని చూశాను. వెంటనే సిగ్గుపడి లోపలికి వెళ్లి, ఆచూపులో యెంతబలం, వాంఛ నిండివుందని ఆలోచిం చాను ఆశ్చర్యముతో ఆసాయంత్రమంతా. ప్రతిరోజు పొద్దున్నే ఆ వ్యవ హారంమీదనే ఆయనవద్దరికి వొచ్చాడు. వస్తే మన్నా అనుకో; నేను కూరలు కోస్తున్నా, మజ్జిగ చేస్తున్నా, కాఫీ తాగుతున్నాసరే అతను వొచ్చాడని తెలిసేది యెట్లాగో - యింకా పెద్దగా మాట్లాడే అతని కంఠం నాకు వినబడకముందే, నాకు గుర్తు తెలీకముందే. ప్రతిరోజూ నాలుగైదుసార్లు దొడ్డిమీద కనబడ్డాడు. రెండుమూడురోజులు నేను గుమ్మంలో తను వొచ్చినప్పుడు లేకపోతే, నాకోసం తనచూపుని అక్కడ వొదిలి వెళ్లాడా అనిపించేది నాకు. నేను తనవంక చాలాయిష్టంగా చూ డ్డాన్ని అమీర్ తర్వాత అన్నాడు. నామనసులోమాత్రం అతన్ని యెదురుచూడడం, అతని తీవ్రకాంక్షకి నేను కావలసినదాన్ననే భావంతో గొప్పసంతోషంలో నిండిపోవడం అలవాటైనాయి.

ఆవేళ మధ్యాహ్నం రెండింటికి వాకిట్లో నుంచుని వున్నాను. ఎండతో ఆకాశంనించి నేలవరకు లోకం నిండివుంది. ఆ గాఢాన్నంతా యెండే వెన్నెలైనట్లు, ఆ రోడ్లంట వుద్యానవన విహారానికై వొచ్చినవాడి వలె నడుస్తున్నాడు. ఎక్కడెక్కడ నా వస్త్రాల్లోంచి నా శరీరం కనపడుతుందో అన్నట్లు వెతికి, వొళ్లంతా సిగ్గుపరిచాయి అతని చూపులు. నిర్మానుష్యమైన ఆ రోడ్డుమీద నా కేదురుగా ఒక్క నిమిషం ఆగి, యింట్లోకి పనిమీద వెళ్లే యజమానివలె నడిచి వొచ్చాడు గుమ్మంవేపు. నేను యింట్లోకి వెళ్లి ఆఫీసుగదిగుమ్మంలో నుంచుని 'లే' రన్నాను. కాని అతను నే నేమంటున్నానో వినతలచుకోలేనట్టు తోచింది. నాతో గాని, నా మాటలతో కాని తనకి పని లేనట్టే; ఆ యింటికీ, నా హృదయానికీ తను అధిపతినని తెలిసినట్టే వొచ్చేశాడు. నేను లోపలికి వెళ్ళి తలుపుపక్కకి తప్పుకుంటో వుండగానే వొచ్చి, నాచుట్టూ చేతులు పోనిచ్చి అదుముకున్నాడు. అటు చూడలేదు. యిటు చూడలేదు. అతని దృష్టిఅంతా నామీదనే, నాకోసమే. యేం మోహమని! ఒక్క రెండు నిమిషాల్లో నేను బతికి వున్నానో, లేనో – అది ఆఫీసుగదో, మహారణ్యమో – నేను నేనో, యింకెవరో – తెలీనంత గాఢంగా, వూపిరాడకుండా, బలం మిగలకుండా రక్తాన్ని ఆపేసి, గుండెల్ని పిండేసి మాయమైనాడు. వెళ్లి శరీరమంతా సర్దుకొని మంచంమీద కూచున్నాను.

ఏం జరిగింది? ఇది పాతగదేనా? ఎప్పటి మధ్యాహ్నపు యెండేనా యిది? లేచి ఏదో గొప్పకార్యం, అందర్నీ ఆశ్చర్యమగ్నుల్ని చేసేపని చెయ్యాలనిపించింది. సంతోషంతో కేక వేశాను. చప్పున లేచి నుంచున్నాను. నవ్వాను. అద్దం దగ్గిరికి ఒక్క గంతేసి చూసుకున్నాను. నా మొహాన్ని నేనే ముద్దు పెట్టుకున్నాను. ఎవరితో చెప్పను యీ సంతోషాన్ని? ఈ నవ నృత్యోత్సవాన్ని యేవిధంగా ప్రకటించను? ఎన్నడూ పాటరాని నా గొంతులోనించి సంగీతం బయలుదేరింది మొదటిసారి. నా బతుక్కి అంతా

మొదటిసారి మోహమాధుర్యం జల బైలుదేరింది. ఇల్లంతా ప్రతిమూలా వెలిగింది నా హృదయంలోని ఆనందజ్యోతితో. ఇంకోరు నన్ను, నన్నే, నా అందాన్నే కోరి, బాధపడి, సాహసించి, ఆనందపడుతున్నారన్న అనుభవం పొందినజన్మ మృత్యువును చూసికూడా భయపడదు. అమీర్, నా అమీర్, నన్నేంచేశాడు? మనిషికి, నాకు దేవత్వాన్ని అమృతత్వాన్ని ప్రసాదించాడు.

అసతోమా సద్గమయ
తమసోమా జ్యోతిర్గమయ
మృత్యోర్మా అమృతం గమయ.

అన్న నా భర్తపఠించే ఉపనిషన్మంత్రం జ్ఞాపకం వొచ్చింది. నేనే మారిపోయినాను. నేను నేను కాదు. ఆరోజే పాతరాజేశ్వరి చచ్చింది అప్పుడే నేనంతా అతనే. అతని బలమైన మోహంలో లీనమైపోయినాను.

ఆనాటినించి యింక మధ్యాన్నమాతోందంటె నామనసు గంతులు వేసేది. 'ఎక్స్పెక్టేషన్' తో నాకు వూపిరి పీలపడం కష్టమయ్యేది. అన్నం వొడ్డించేప్పుడు అమీర్ జ్ఞాపకం తట్టిందంటే నాకు తటస్థించిన మహా అదృష్టానికి చేతులు వొణికి తప్పాలని నిలబెట్టటమే కష్టమయ్యేది. అన్నం తింటోవుండగా అమీర్ జ్ఞాపకం వొచ్చాడంటే యింక అన్నం కొంచె మన్నా సయించదు. కంఠంలో యేదో గట్టిగా పట్టుకొని వుక్కిరిబిక్కిరి చేసేది. నా పెనిమిటితో పడుకున్నప్పుడు అమీర్ మీద మోహం కలిగి, నిద్రలో ఆయన్ని గట్టిగా కావిలించుకున్నాను. నన్ను లేపి ఆయన "ఏదైన కల వొచ్చిందా" అని అడిగారు. భయానికీ మోహానికీ భేదం తెలీని ఆయనతో పాటు మంచంమీద పండుకోడంకన్న మర్యాదకి అపకారం [illegible] వుంటా? [illegible] 'పాయింటు' అడుగు, దేనికైనా [illegible] గా [illegible] చెప్తాడు. [illegible] సాక్షి హృదయానికి [illegible]

మకలు పెడతాడు. భార్య కావలించుకోవడం మోహంవల్లనో, భయం వల్లనో భేదం తెలీదు. యిట్లాంటివారు మన భర్తలు! వాళ్ళకి పెళ్లాలు కావాలా! లాయరుహంగులో మనమూ వొక భేషజం - ఆ పుస్తకాలు బీరువాలూ, గుర్రప్పుబండీ లాగే. యెవరన్నా వొస్తే వొంటినిండా నగలువేసి మనని చూపించవొచ్చు; మనం చేసిన కూరలరుచి చూపించవొచ్చు; దేహంలో అకస్మికంగా కలిగే ఆ కామరోగాన్ని మనద్వారా కళ్ళుమూసుకుని నయం చేసుకోవొచ్చు.

అమీర్ తలపు మాత్రం చాతనే నాకు కలిగేబాధని యెట్లా భరించడమని భయం పుట్టేది. ఇది పశుకామ మంటారు కదూ? కాబోలు. అమీర్ కనబడకముందు నాభర్తతో మామూలుప్రకారం సంతోషమూ బాధా యేమీ లేకండా గడపిన రాత్రిలన్నీ ప్రేమ; ఆయనికి వండడం, మడిబట్ట లందియ్యడం, తలంటిపోస్తో వీపు రుద్దడం- యివి ఆధ్యాత్మికమైన నిర్మలప్రేమ చిహ్నాలు; పార్వతమ్మ కట్టుకున్న చీరెని పొగిడి, అట్లాంటిది కొని పెట్టుమని నేను ప్రాణాలుతియ్యడమూ, పులుసులో యింగువవాసన లేదని నన్ను ఆయన తిట్టడం యివి మా మానసిక ప్రేమ తత్వాలు.

అట్లానే అమీర్‌తో ఐదారు మధ్యాన్నాలు జరిగాయి. తలుచుకుంటే నాలుగు గంటల కాలంలాగు తోచినా, ఒక పావుగంటకంటే యెక్కువ అతను వుండలేదు. ఆకాసేపట్లోనే నన్ను ఒక సంవత్సరానికి తగినంత మాధుర్యములో ముంచేశేవాడు. అన్నిట్లోకీ నాకు గొప్పగా తోచిందేమిటంటే- రోడ్డుమీద యెవరున్నారో, యింట్లో యెవరున్నారో చూడకండానే సరాసరి లోపలికి వొచ్చేసి, సరాసరి తిరిగిచూడకండా వెళ్లేవాడు అమీర్.

ఒకరోజు మధ్యాన్నం 'నాతో వొచ్చెయ్యి' అన్నాడు. అదే మొదటిసారి నాతో గొంతుకలొంచి మాట్లాడ్డం అతను. అప్పుడతని తుర

కం తెలుగు వింటే, నా కెంత ముద్దొచ్చిందని! చిన్నపిల్ల మాట్లాడ్డానికి చేసిన ప్రయత్నంలాగే వుంది. అదివరకు తురక తెనుగు పరమఅసహ్యంగా వినపడేది. కాని ఆనాటినుంచి గొప్పసంగీతమైనా ముసల్మాన్ తెలుగంత మధురం యింపేమీ లేదు. ప్రేమ - కామం, పశుకామం - యెన్నిమార్పులు కలగచేస్తుందో మనసులో!

అత నడిగిన ప్రశ్న నన్ను విభ్రమంలో ముంచగా తేరిబారచూస్తున్నాను. పళ్లుబిగబట్టి, తనకికూడా వూపిరాడదని అవస్థ కలిగించుకుని 'రావూ, రావూ? రాకపోతే చంపేస్తా నిన్ను' అన్నాడు. అతని కళ్ళలో మొదటిసారి చూశాను భయంకరమైన యెరుపురంగు - నన్ను తినెయ్యాలి, నన్ను చంపెయ్యాలనే ఉగ్రం- మళ్ళీ వారంకిందట చూచాను.

“చెప్తాను తరవాత. మళ్ళీ నువ్వురావూ, అప్పుడు సావకాశంగా మాట్లాడాలి” అన్నాను.

మళ్ళీ వారంరోజులదాకా వీలుకాలేదు. ఆయన వూరికి వెళ్ళిన రాత్రి అమీర్ని రమ్మన్నాను. పదిగంటలయింది. పడకగదిలో అద్దం ముందు నుంచుని నన్ను నేను చూచుకున్నాను. చీకట్లో యీ సిల్కు జాకెటు చూస్తాడా? ఈ ముత్యాలహారం కనబడుతుందా? అతని కేమన్నా ఫలహారం పెడితే? యేమనుకుంటాడు? కాని వ్యవధానమిస్తాడా? వొంటికి అత్తరురాసుకోబోయినాను. ఆయన పన్నెండు రూపాయలు పెట్టి కొనితెచ్చిందది. ఆయన తెచ్చినఅత్తరు అమీర్ కోసం పూసుకోవడమంటే చప్పన సిగ్గేసింది. బుడ్డీఅక్కడపెట్టి ఆలోచించాను. కాని జాకెట్ మాత్రం ఆయన్ది కాదూ? విప్పేశాను. తక్కినబట్టలో? నవ్వొచ్చింది నాకు. మళ్ళీ జాకెట్ వేసుకుంటున్నాను.

మళ్ళీ యింతలో ఆలస్యమౌతోందని జ్ఞాపకంవొచ్చి, అన్నీ అట్లానే వొదలి, ఆఫీసుగదిలోకి వొచ్చి, బైట గుమ్మం తెరిచి, పక్కగా రోడ్డు

మీదికి కనబడుతో నుంచున్నాను. బైట యింకెవరికన్నా కనబడుతున్నానని భయంవేసింది. లోపలిగా జరిగాను. కాళ్ళు వొణికి నుంచోడం కష్టమై యిటూ అటూ నడిచాను. రోడ్డుమీది దీపం నామీద పడుతోంది. అక్కడక్కడ కాళ్ళు చప్పుడైనప్పుడల్లా గుండెలు కొట్టుకుని కొట్టుకుని నీరసపెట్టేశాయి. గదిలోకివెళ్లి కూచున్నాను. అమీర్ వొచ్చి, నేను లేనని వెళ్లిపోతాడేమోనని భయమేసి లేచాను: కాని గదిలోనే వుంటాను రమ్మని చెప్పానని జ్ఞాపకం వొచ్చి కూచున్నాను. కాని చెప్పానా? చెపుదామనుకున్నాను. కాని చెప్పానా? అవును చెప్పాను. చెప్పినప్పుడు అమీర్ కనుబొమ్మలు పైకి లాగాడు. యెందుకా అనుకున్నాను కూడాను. కాని బైటికి వెళ్ళడం యెట్లాఐనా మంచిది. అని బైటికి వెళ్లి పదినిమిషాలు నుంచున్నాను. ఈ రాత్రి రాడేమో? నాతో ఒట్టితమాషా చేశాడేమో ఇన్నిరోజులూ? ఈ రాత్రి యేదన్నా పనివుండిపోయిందేమో? కాని ఆపని మానుకుని రాడా? రాత్రిలు దారి తెలీలేదేమో? నువ్వెవరని పోలీసులు పట్టుకున్నారేమో! గుండె దడదడలాడింది. మళ్లీ గదిలోకి వెళ్లి కూచున్నాను. ఇంత బాధ పెడుతున్నందుకు అమీర్‌మీద కోపమొచ్చింది. తొరగా వొస్తేనేం?

నామనసు ఆందోళన అణపడానికి కిటికీలోంచి కనపడే నక్షత్రాలన్నీ లెక్కపెట్టాలనుకున్నాను.—ఇవన్నీ యెందుకు చెపుతున్నానంటే నీకు—కొంచెం ఆలస్యమైతే యింత వ్యధపడ్డానే, యిదంతా కామమేనా? అదే ఆలోచిస్తున్నా. నిన్న మామయ్య యిక్కడికి వొచ్చి "చెప్పితే విన్నావు కావు. చూశావా, నీగుడ్డికామం నిన్నెంతకి తెచ్చిందో!" మామయ్య యీమాటలంది! నేను కాపరానికి వెళ్ళకముందు ఆరు నెలలు నావెంట వెంటపడి లోబరుచుకోవాలని చూశాడు ఒక్కరికీ తెలీకండా. ఎవరితో నన్నా చెప్పుకోడం నాకు సిగ్గని తెలుసు. చివరికి నేను అమ్మతో చెపితే అంతా అబద్ధమని బూకరించాడు. ఆ మామయ్య యీ మాటలంది! నిజ

మని వొప్పుకునే ధైర్యమే కలవాడైతే, నాస్వభావం మామయ్యని స్వీకరించి వుండునేమో! అమీర్‌నే అడగమను యెవర్నన్నా, అబద్ధం చెప్తాడేమో! అది పోనీలే. కాని, నాది కామమేనా! నా కామమూ, నా త్యాగమూ నన్నీ కైదులోకి తెచ్చింది? పాతివ్రత్య శిరోభూషణం, పురాణ స్త్రీలందరూ గుడ్డిగా అనుసరించిన పతివ్రతాధర్మం, ఆత్యాగమేనా? ఇంత గాఢంగా అతన్నే కోరాను, అతన్ని పూజించాను, అమీర్ని. అతని కోసం నా బంధువుల్ని, కాలాన్ని, సంసారాన్ని, సుఖాన్ని వొదిలాను. అది యింకా కామమేనా? నా అమీర్ కోసం నేను చేసిన త్యాగాల్లో నూరోవంతు చేస్తారా, యీభార్యలు? నువ్వూ యోచించు; నాహృదయ మతనికోసం యెట్లా యెంత తపించిందో? కామం వల్లనే!

నిష్కారణముగా పక్కున నవ్వాను. నామెళ్లో ముత్యాలు నాలుగు వందల యాభైమూడు వున్నాయేమోనని లెఖ్ఖపెడుతో వుండగా వొచ్చాడు అమీర్, చెప్పులు పెద్దగా చప్పుడు చేసుకుంటో. కొంచెం నెమ్మదిగా వస్తే ఆతనిసామ్మ్యం పోయింది, అనుకుంటో వొయ్యారంగా తలుపుదగ్గిరకి వెళ్ళాను. వెంటనే కావిలించుకొని గట్టిగా పట్టుకొని ఒకసారిగా నాతో కూడా వెనక్కి నడవడానికి ప్రయత్నించి వొడలక తూగి, తూలి, పుస్తకాల బీరువామీద పడ్డాము. పెళపెళమని అద్దంపగిలి గల్లుమని పెంకులు కిందపడి మళ్లీబద్దలైనాయి. యేంజ్ఞాపకమొచ్చిందో ఆ నిమషాన, ఆయన బీరువాని మేమిద్దరం పగలకొట్టడం అతి హాస్యాస్పదంగా కనబడి పకపక నవ్వి, బద్దలయ్యే అద్దంపెంకుల చప్పుడుతో నా కంఠం కలిపాను. మరునాత నిమషం నావూపిరాగింది. యిల్లంతా, నడవాలోపడుకున్న వాళ్ళంతా, విని లేచినట్లే తోచింది. అమీర్ కౌగిలిలో పెనిగాను. కాని వొదలడుకదు! మనుష్యులు లేవడం, వెతకడం, దీపాలతో గదినిండడం జరిగినట్టే తోచింది నాకు. కాని వాళ్ళందరూ వొచ్చినా, అమీర్ మాత్రం తలన్నా యెత్తి చూడకండా తనపని తను చూసుకునేట్టుగా కనపడ్డాడు. అపాయముంటే

యేమిటో అర్థంకాని మనిషి అతనొకడు కనపడ్డాడు నాకు. అదేమి అదృష్టమో, ఆ అపాయం అతన్ని చూసి తొలగిపోయ్యేది. అతని నిర్లక్ష్యం చూస్తే ఒకప్పుడు అతని పాదాల్ని నాప్రాణాలతో కడగాలనిపిస్తుంది ; ఒకప్పుడు మీదపడి చీల్చి చంపెయ్యాలనిపించేది.

కొంతసేపయింతరవాత స్వస్థపడి నెమ్మదిగా మాట్లాడుకున్నాము కిటికీకిపక్కగా బల్లమీద కూచుని. మామిడిచెట్టు పూతలోంచి మిణుగురుపురుగులూ, ఆరదార్రి కలిసి మెరుస్తున్నాయి. చలిగాలి మమ్మల్నప్పుడప్పుడు పలకరిస్తోంది. కాలవలో కప్ప మూలుగుతోంది. గోడ్డుమీద లాంతరు వెలుతురు కొంచెంగా [illegible]మీదపడి, ఆవాటి పుస్తకాలమీది బంగారపు అక్షరాలు తమాషాగా మెరుస్తున్నాయి.

"యెక్కడికి తీసికెడతావు నన్ను ?"

"నిజాం"

"వెళ్ళి"—

"హాయిగా వుందాం"

"అందరూ వూరుకుంటారా ?"

"తెలిస్తేకద! వెళ్ళిపోయాక తెలిస్తేమాత్రం యేం చేస్తారు."

"అక్కడివాళ్ళు ?"



"మనకి తెలిసిన వాళ్ళెవరుంటారు? ఆదేశం చాలా బావుంటుంది, మనుషులు చాలా మంచివాళ్ళు, స్నేహానికి ప్రాణమిస్తారు, నీకేం భయం లేదు" అన్నాడు. అదివరకే నిశ్చయించుకున్నాను వెళ్ళాలని. యెందుకు? అమీర్తో వుండాలని. అతనితో కావలసిన కామం యెక్కడ భయం లేకుండా సాగుతోనేవుంది. నాకేకాదు, చాలామంది పతివ్రతలకి సాగుతోంది అట్లా. అట్లాంటప్పుడు యింట్లోంచిపోయి కులభ్రష్టను కావలసిన అగత్యమేముంది? అమీర్తో కామం తీర్చుకోడానికి కాదు, అతని

ముఖం చూస్తో అతన్ని పూజించడానికి. పంటకోసమూ ఆరాత్రి నిముషాలకోసమూ నాభర్తతో బతికాను. అమీరుతో అందుకు కాదు. అమీరు కళ్ళలోని ఆరాధన చూసేందుకు; అతనితో మాట్లాడి, అతనివంక చూస్తో వుండే అదృష్టానికి వెళ్ళాను. అది కామమే? యీయాసతో జీవనం పవిత్రప్రేమా? అమీరు ఒక్కసారికూడా నన్ను తాకకన్నా సరే వెళ్ళిపోయేదాన్నే! అతని పాదసేవకి, అతనితో సుఖదుఃఖాలు పంచుకునేందుకు, అతని ఆజ్ఞలే, అతని దయే, అతని పూజే నాహితంగా, నా స్వర్గంగా, నా ఆనందంగా, నా జీవనాన్ని అర్పించేందుకు. అతను నన్ను ప్రేమించనీ, చంపనీ, పాలించనీ, వొదిలెయ్యనీ. ఆ క్రొత్తవాడు తురకవాడు, అతన్ని సహజంగా నమ్మి - సమస్తమూ త్యజించి - అతని చేతుల్లో నా ప్రాణాల్ని అర్పించాను. ఇంత విశ్వాసమూ, యింత త్యాగమూ, అంతా కామమేనా? నా హృదయంలోని ఆ అపరిమేయానందమూ, ఆ అనిర్వచనీయ మాధుర్యమూ, నా అల్పత్వమూ, క్షుద్రత్వమూ వొదిలి, నగలు, చీరలు, మర్యాద అన్నీ అసహ్యాము లనిపించజేసిన అద్భుతానుభవం, కామమా? ఎన్నడూ అంతవరకు అసలు జీవితంలో సాధ్యమని అనుకోని, ఆ మహాద్భుతరసనా, రసికత్వమూ, ఔన్నత్యమూ యివన్నీ క్షుద్రకామమేనా! భోజనమూ, నిద్రా, లోభత్వమూ, తిట్లూ, చీవాట్లూ, రోతా, అసహ్యమూ ఇదంతా పవిత్రప్రేమా! అట్లా అయితే ఈశ్వరుడే, సృష్టిరహస్యమే కామం. ప్రేమ అంటే ద్వేషమని అర్థం.



# 2

అక్కడికి వెళ్ళిన మొదటి నిమిషానే అర్థమయింది నాకు, ఆ స్థలం లో అద్వితీయానందాన్ని అనుభవించపోతున్నానని. చుట్టూవున్న ఆకాశాన్నీ, కొండలన్నీ, పక్కన చింతచెట్లనీ, మా చిన్నయిల్లునీ, ఆగాలినీ, అమీర్నీ చూడగానే నా మనసెట్లా అయిందనుకున్నావు- చెప్పనా- చిన్నప్పుడు మనముందు పది పిండివంటలు పెడితే, యేదితినాలో తోచక, తినబోతున్నా మని తెలిసికూడా, అన్నీ వొక్కమాటుగా యెట్లా తినాలా, యిది తినేలోపల రెండోది రుచిచూడడం ఆలస్యమౌతుందే అని యెంత కష్టపడుతుంది మనసు? అట్లానే; ముందే తెలుసు దినము తరవాత దినము నాకు తీసుకురాగల వివిధవర్ణరాగసుందరానుభవాలు! కాని ఆగలేను, అన్నీ ఒక్కసారిగా, తొరగా యెప్పుడు నన్ను కావిలించుకుంటాయా అని తహతహలాడిపోయినాను. యేంకారణం లేకుండా చిన్నప్పుడు పూరకే నవ్వూ అర్థంలేని ఆనందం కలిగి, యింకా యేంచేద్దాం, యెట్లా తిరుగుదాం, గంతులేద్దాం, నవ్వుదాం అనిపించేదే, అట్లావుండేది గంటగంటా నాకు. పూరికీ మాకు మధ్య పెద్ద చింతతోట వుంది. ఆగుడిశ తప్ప యింక చుట్టూ యేమీ లేవు. యెటుచూసినా నీలపుకొండల్లోనూ ఆకాశంలోనూ అంతమయ్యే పెద్దమైదానం. ఒక్క పెద్దకొండమాత్రం మాయింటికి అరమైలుదూరములో వుంది. దానిమీద శిథిలమైనకోట వొకటుంది. మా గుడిశపక్కన చిన్నయేరు యెప్పుడూ తొరగా పరిగెత్తుతో వుంటుంది. దాన్ని చూస్తే, యెవరితో మాట్లాడక, యింట్లో పనిమీద యెప్పుడూ తిరిగే, మాఅమ్మ జ్ఞాపకం వొచ్చేది.

ఆదేశంలో ఆకాశం యెప్పుడూ నీలంకారుతున్నట్టే వుంటుంది, వానకురిసినా, శుభ్రమైన కొండల్నీ, నేలనీ, యింకా శుభ్రంగా కడుగుతుంది. టపటపమని చినుకులుపడితే, కడుపుతున్న స్త్రీవలె నాయేరు నిండిపోయేది. కొండలన్నీ మేఘాల్ని కప్పుకొని తెల్లనయ్యేవి.

మొహటి కుండల్లో వొండటం, నెయ్యీ, కూరలూ, లేకండా తినడం, చాపేసుకుని ఆరుబైటపడుకోడం, కొత్తగా కష్టంగా వుండేది. అప్పుడప్పుడు పిచ్చి పట్టుదలలుకూడా వచ్చేదాన్ని. కాని కష్టపడడానికీ, కొత్త పడడానికీ, పట్టుపట్టడానికీ, వ్యవధివుంటేనా? అమీర్ వుండనిస్తేనా? అయినప్పటికీ నాకు చిన్నప్పటి అలవాట్లు వదలడం యెంతో కష్టమయింది. వంటచేసేప్పుడు అమీ రావేపు వొస్తే, అన్నీ పారేసి మౌనంగా కూచునాను. అన్నంతినక తిరిగాను. కాని ప్రేమ వున్నప్పుడు త్యాగం చెయ్యడం యెంత సులభమనుకున్నావు? ఊరికే త్యాగాలకై పతివ్రతల్ని పొగుడుతారు గాని, ప్రతినిమిషం మన సౌఖ్యాల్ని, ఆనందాల్ని, అనవసరంగానైనా సరే వొదిలేసుకొని ప్రేమబలం స్థిరపరచాలని వుంటుంది.

అయన్ని ప్రేమిస్తో నేను ఆయనయింట్లో వున్నప్పుడు ఒకసారి యింగ్లండు వెళ్ళి వచ్చిన ఆయన స్నేహితుణ్ణి తీసుకొచ్చి తనతో భోజనం వడ్డించమన్నారు. నేనేమి వీల్లేదన్నాను. కారణం? మా పెత్తల్లి సూరమ్మగారికి నామీద కోపంవొస్తుందని పొకటి. ఏమంటుంది? "మొగవాడు అతను అన్నీ నిర్లక్ష్యంగానే చెయ్యాలంటాడు. ఆడదానివి నీకు బుద్ధిలేక పోయిందా?" అంటుంది. తోడికోడలు నన్ను వెలేస్తానని బెదరిస్తుంది నవ్వులాటలకులాగు. పాపం ఆయన నన్ను బతిమాలారు, తన పరువుపోతుందని కన్నీళ్ళపర్యంతమైనారు, తనమీద ప్రేమలేదా, తనమాట వినకూడదా అని అడిగారు. రాయివలె స్థిరంగా నాపట్టుదల విడవలేదు నేను ఇదీ మనం భర్తలకోసం చేసే త్యాగం! ఆధ్యాత్మిక ప్రేమ, పవిత్రదాంపత్యానికి, మన జీవితంమీద వుండే 'ఇన్ఫ్లుయన్సు.' కాని మామయ్య వొచ్చి, 'చివరికి పంకకూడు తింటూన్నావుటే?' అంటే నా కేమనిపించింది? ఏమన్నాను? ఇది పురకకూడా? ప్రేమదేవికి నైవేద్యంపెట్టి భక్తితో కళ్ళనద్దుకుని మధ్యమధ్య అమీర్ ముద్దులతో ఆరగించిన ఆ అమృతం,

తురకకూడా ? యేంతింటున్నావో, తింటూన్నావో లేదో, అనే ధ్యాస వుండేనా ? ఇంక బతకడానికి వీలులేదనీ, ఆకలివేసి మృష్టాన్నమో అన్నం దానికి అవాంతరంగా మనసు మళ్ళించకుండానే గాని, యింక యీవ డ్డరపలె యీకూరలో వుప్పుసరిపోయిందా, యీచారులో పోపుచాలిందా అనే ఆలోచనలు వుంటాయా ? పచ్చడిలో యిసికపడ్డదనీ, అన్నం చిమిడిందనీ, పులుసు పుడకలేదనీ తిట్లూ, లేచిపోవడాలూ, విస్తరి మోహాన కొట్టడాలూ, పవిత్రమైన మానసిక ప్రేమగల ఆదర్శసంసారాల్లో సాగుతాయిగాని, పశువులవలె కామంలో పొర్లాడే గుడిశల్లో జరగనే జరగవు ! మానసిక ప్రేమగనక, దాంట్లో వుప్పెక్కువయిందనీ, కారం యెక్కువయిందనీ తగాదా ! ఈ మానసిక ప్రేమమీద నా కెందుకంత అంతక్రోధం, మామయ్య తీసుకొచ్చాడుదాన్ని వాళ్ళపూరినించి – దానిసంగతి చెప్తా తరవాత. కామంలోపడి కళ్ళుమూసుకుని నరకంలోకి జారేవాళ్ళకి యీ విచక్షణలన్నీ యెందుకుంటాయి ! గంజే పరమాన్నంగా వుంటుంది. అది మళ్ళీ ప్రేమలక్షణమే నంటారు కొందరుపూర్వులు. కాని మామయ్యవంటి విమర్శకులుమాత్రం దాన్ని పశుకామమే నంటారు ! యెందుకు ? వారి నీతి హృదయాలకి నెప్పికలిగిస్తోంది ! నావంటివారి పాడుజీవిత చరిత్రలను చదివి, విని, వారిభార్యలూ కూతుళ్ళూ లేచిపోతే యెట్లా !

ఇంక విను. అరుపైట చక్కని బంగారపు యెండలో, చేతులు పైకిజాచి, ఆవలించి వొళ్ళువిరుచుకొని చాపమీద నించి, ఒక్క దూకుదూకి లేచి ఒకరిమొహం వొకరు కొత్తగా, అందంగా చూసుకు, రాత్రి జ్ఞాపకంవల్ల కొంచెం సిగ్గుపడి, చుట్టూవున్న సౌందర్యాన్ని చూసి నవ్వడం ; వూరికే, కారణంలేకుండా, ఆనందంతో ఒకరికి ఒకరమూ, మి ద్దరికీ కలిసి ఆసుందరలోకం వుందనీ – నవ్వడం. పొద్దున్న కాఫీ లా, యేం లా. ఒక్కరోజు కాఫీ గంట ఆలిస్యమైతే గిలగిలలాడేదాన్ని. మొదటిరోజు

నించీ కాక్షీనే మరచి పోయినాను. పెందరాళే, యిన్ని బియ్యం కుండలో వేసి యేట్లోకి దిగేప్పటికి అమీర్ యిన్ని చితుకులతో పొయ్యి వెలిగించే వాడు. ఆమంట ఐపోయేప్పటికి అవి వుడికి వుండేవి. గుడిశ వెనక రాయి వుంది, దానిమీద యేవుల్లిపాయో, గోంగూరో మిరపకాయో, వుప్పో, వేసి నూరడం. అంతే వొంట. వున్నప్పుడు చల్ల. అప్పుడప్పుడు తమాసాకి అమీర్ బైట కూచుని, పావురాలని అడిస్తోవుంటే నేను వెళ్ళి గుడిశ తలుపుచాటునించి, సన్న గొంతుకతో,

"లేచి మడి కట్టుకోండి" అనేదాన్ని. అతను, ప్రయత్నంతో సాధ్యగొంతూ బ్రాహ్మణ వుచ్చారణా పెట్టి,

"ఇదిగో, లేస్తున్నా, యీ కాయితము చదివేసి,..............." అనేవాడు. ఒకసారి మరిచిపోయి

"ఈ పావురాన్ని వొదిలేసి" అన్నాడు. యేంనవ్వేవాళ్ళం!

ఒకసారి అమీర్ వచ్చి "మరి కచేరివేళ అయింది యింకా వొంట కాలా?" అన్నాడు.

"అయ్యో! యీవాళ తద్దినమని జ్ఞాపకం లేదూ, మీకు?" అన్నాను.

ఆమాటకి నవ్వు పట్టుకొని దడదవేపు భీకరంగా వొంగితే తప్పించుకోడానికి వెనుగులాడాను.

అంతకని బుజంమీద కొరికాడు. అదుగో, వెక్కిరిస్తోంది నీనోసలు! కొరకడమేమిటి, అదేం సరసమనేనా? ఆ మైదానంలో గుడిశల్లో బతికి, కుండ్లు తినేవాళ్ళకి మాకు నాజూకు లెక్కడివి? దేహాన్నీ, మనసునీ కూడా అంటకండా, కళ్ళుమూసుకుని, వేదాంతోక్తంగా సంసారాలు గడపడం ప్రష్టి, జవా, నిండురక్తమూ వున్న మోటుప్రజలకు చాతకాదు

మరి. చదువులతోనూ, రోగాలతోనూ, ముప్పైయేళ్ళకే ముసలివాళ్ళయిన, యీ నవీనరసికులకుమాత్రమే చాతనౌను - మాటలతోనూ, ధర్మబోధనలతోనూ, ఆధ్యాత్మిక ప్రేమతోనూ తృప్తిపొందడం. అమీర్ సంతోషం వొచ్చి నన్ను, ఒక్కవూపు వూపాడా కళ్లుతిరిగి మూగంగా తూలేదాన్ని. గట్టిగా జబ్బపట్టుకున్నాడా, రెండుగంటల దాకా నెప్పిపోదు. కావిలించుకుంటే వూపిరాడదు. మొదట్లో - కళ్ళల్లో అల్లరీ, ప్రేమా (మరచిపోయినాను. మామయ్య ఆమాట అనవొద్దన్నాడు) కామమూ, వెలుగుతో నా వంక నడిచాడా, భయంతో వొణికేదాన్ని.

ఇంక మా స్నానం రోజుకెన్ని గంటలు యెన్నిసార్లు గడిపేవాళ్ళమో ఆయేట్లో! వానకురుస్తున్నా, చలేస్తున్నా, యెండలో, చీకట్లో, యెప్పుడూ స్నానమే! యెంతబావుండేది! యెండలో సోమ్మసిల్లాడే యేటిచల్లని నీళ్ళలో తెల్లని యిసికమీద పడుకోడం! ఆచిన్న అలలు నామెడని కొడుతూ, నీళ్ళు స్నేహితులులాగు యిద్దరినీ దగ్గరగా లాగుతూ, పరిగెత్తడం, యెంతబావుండేది.

ఒకసారి చీకట్లో అమీర్తో "అమీర్, నాకాగ్యంనాడు ముస్తైదులు నన్నాయనదగ్గరికి యీ నీళ్ళలాగే తోశారు" అన్నాను. నాప్రక్క వెనకనించి అతనినవ్వు వినపడుతుం దనుకున్నాను. దానిబదులు కర్కశమైన కంఠంతో,

"యెవరు వాళ్ళు?" అన్నమాట విన్నపడ్డాను. ఆశ్చర్యపడి, తమాషా చేస్తున్నాడని వెనక్కి తిరిగి చీకట్లో అతని మొహాన్ని చూశాను నీళ్ళమీదనించి.

"ఎవ రేమిటి?"

"వాళ్ళపేర్లు?" అన్నాడు ఖండితంగా.

"ఎవరిపేర్లు"

"ఆముత్తైదుముండ లంటే!" అన్నాడు విసుకుతో. చప్పున నీళ్ళల్లో అతనిదగ్గిరకి వేలి బుజాన్ని ఆనుకోని, చేతులు మెడచుట్టూవేసి,

"ఎందుకు, అమీర్! ఏమిటా కోపం?"

'చెప్పు.'

'వాళ్ళు చెప్లా?'

'అవును.'

నవ్వాను. వ్రాగే నావత్కుము నీళ్ళలోనించి అతనిహృదయాన్ని కరిగించింది.

'నిన్ను - నిన్ను - నాదాన్ని - నిన్ను - వాడి దగ్గిరికి, ఆగొండు వాడిదగ్గిరకి, బలవంతంగా లాగారా? ఆరాత్రి పాపం, చిన్నదాన్ని - సహాయంలేనిదాన్ని - నిన్ను - వాడిచేతుల్లోకి - వాడిగదిలోకి - నరుసుతా, ఒక్కొక్క ముండనే కొప్పుపట్టుకులాగి - ఒక్కొక్క..................' ఇంకేమేమో అన్నాడు. ఆమాటలే దుర్గమ్మ అత్త, ఆతాసీల్దారుగారి భార్య వింటే?— నాకు చాలా నవ్వొచ్చింది.

'కాని నాకు వెళ్లాలనే వుందిగా! వూరికే సిగ్గుపడుతున్నాను అంతే!'

నానోరు గట్టిగా మూశాను. 'అనకు. ఆమాట అనకు. వాడిమీద, ఆ పంద మీద, ఆకుళ్లుసిబ్బిమీద—'

పక్కున నవ్వాను. ఆయన్నంటే కోపమే రాలేదు. అదేదో పూర్వ జన్మలాగుంది ఆయనతో కాపరం.

'పుల్లుసిబ్బేమిటి, అమీర్? అంటే?' నవ్వుతున్నాను. ఆనీటి మీదనుంచి నానవ్వు బ్రిడ్జికింద ఆచీకట్లో మారుపలికింది. అమీర్‌కి అంత యీర్ష్య. సహించలేడు ఆయన్ని గురించి ఒక్కమంచి మాటమాట్లాడితే!

విను - ఎంతసంతోషంగా వుండేది అట్లా స్నానాలుచేస్తే! స్వర్గంలో సౌఖ్యాలంటే, యివేగావును, అనిపించేది. స్వర్గంనరకం సంగతెత్తితే అమీర్ కి కోపం. మనస్వర్గం అది అంతా అబద్ధమంటాడు. తనతోకూడా నన్నూ వాళ్ళ తుగకస్వర్గానికి తీసుకుపోతా ననేవాడు.

"నేను ముందరచస్తే!"

"నేనూ చస్తా!"

రెండోమాట నే ననలేక వూరుకుంటే, అతనే—

"నేను చస్తోవుంటే, నిన్నూ చంపుకుంటా" అన్నాడు.

"పోనీలే, పాపం. నీకోసం నేనూ చస్తాలే" అన్నాను నవ్వుతో.

"చావకపోతే, చంపుతా."

"కాని అమీర్, మనంచేసిన యీ ఘనకార్యానికి మనకి స్వర్గమిచ్చే దాత యెవడు?"

"మా స్వర్గంలో పరవాలేదు. నేను మాట్లాడతాగా!"

"ఎవరితో?"

"మా స్వర్గంవాళ్ళతో."

"తమాషాగావుందే, మీ స్వర్గం సంగతి? మీ నరకంలో యెవరుంటారు?"

"హిందూప్లీడరు కాఫర్లు" అని రాయిపెట్టి కుండ పగలకొట్టాడు! నవ్వెట్లా ఆపుకోను?

"ఆయనమూలంగా ప్లీడర్లందరికీ యిప్పించావా నరకం?"

"కాకపోతే, నాదగ్గిర వ్యాజ్యాని కని ముగ్గురు ప్లీడరు గాండ్లు వాడుకులు మూడు అర్లు పదహారు రూపాయలు లాగారు. వాళ్ళందరికీ ఖాం... నరకమే."

"నీ పెత్తనమే!"

"చూస్కో, అబద్ధమేమో!"

ఇంకేం మాట్లాడను?

అట్లా గడిచేవి మాస్నానం సంభాషణలు. (ఒకరినొకరు నీళ్ళకింద తాకుతో, ఒకరిని ఒకరు రుద్దుతో, తోసుకుంటో యెన్నోగంట లాడుకునే వాళ్ళం.) అమీర్ నాకు యీత నేర్పాడు. ఎవరన్నా కొత్తవాళ్ళు వొం తెన మీదనించి పెడుతోవుంటే, యిద్దరం కదలకుండా దానికింద యిమిడి, వాళ్ళు వెళ్ళగానే, పెద్దనవ్వు నవ్వుతాము. నాజుట్టు నీళ్ళలో నల్లగా తేలుతో చేతులు నీళ్ళకింద వొంకరగా కనపడేట్లు నీళ్ళుతోసుకుంటూ, యీత్తే, అమీర్ అట్లానిలిచి నన్ను చూస్తో

"ఆగకు. అట్లానే తేలుతోవుండు. అట్లానే యెప్పుడూ...... ఆజుట్టెక్కడిది? ఎట్లా తెచ్చుకున్నావు? అరేబియాలో రాత్రి వీచే యీదురుగాలి నీజుట్టురూపం దాల్చింది!" అని వూరికే బాధతో మరి సిపోతాడు. (మునిగి వొచ్చి నాకాళ్ళని పట్టుకుని నీళ్ళలోకి లాగి ముంచి, కావిలించుకుంటాడు. రెండు మూడుసార్లు, యీత్తో, యీత్తో, నన్ను గట్టిగా కావిలించుకున్నాడు.) ఇద్దరం అల్లానే మునిగిపోయినాము అడుక్కి. నల్లని యిసికమీద పడుకుని పైకి నీలంలోకి చూశాను ఒకనిమిషం. అతని చేతుల్లో అతనికింద అక్కడే వుండాలనుకుంటున్నా. ఇంతలో నీళ్ళుతా గేశాను. ఒకొక్కరాత్రి వెన్నెట్లో స్నానంచేస్తాము. అమీర్ అవొడ్డుకి యీది, దూరమై నీళ్ళకిందదాక్కొని నన్ను భయపెడతాడు. యెవరూ లేక యిద్దరమే ఆ ళ్ళ నిశ్శబ్దంలో కూచుని ఒకరిమొహాలొకరం చూచుకోడం నాకు భయం. కాని అమీర్ దగ్గిరగావుండి చెయ్యేసినంతసేపూ యేదో నీళ్ళలోకంలో వున్నట్లుండేది. ఒకరోజు నన్ను 'వులూపి' అని పిలవ మన్నాను నా అర్జున్ణి. అర్జనుడూ అదంతా అబద్ధమంటాడు అమీర్.

(పూర్వం మా మరిదిన్నీ అతని పెళ్ళామున్నూ బట్ట లిప్పేసుకుని ఒకరి కెదురుగా ఒకరు కూచుని స్నానాలు చేస్తారని విని నాకు పరమ అసహ్యం వేసేది. కాని ఆ యేటింలో రాత్రిలు యిద్దరం బట్టలన్నీ యిప తల పారేసి స్నానం చేసేవాళ్ళం.) నీ కర్థమౌతుందా, ఆ ఆనందం! కామం. పశుకామమంటున్నాయి నీ కళ్ళు! కామంకాదు. ఈ ఆకాశంకింద ఆ నీళ్ళలో బట్టలెందుకు! బట్టలువేసుకున్నా గాలీ నీళ్ళూ వొంటినంతా తాకుతాయి - అమీర్ కూడా అంతే. (ఇద్దరం నీళ్ళలో దొర్లుతూవుంటే అమీర్ వేళ్ళు నాజుట్టునీ, బుజాల్నీ, రొమ్మునీ, తొడల్నీ తాకితే నాకు చెరువులో తామరకాడలు వొంటికి తగిలినట్టుండేది.) అతను మొగవాడనే భావంగాని, అతని స్పర్శవల్ల కామవికారం కలగడం గాని యేమీ వుండేది కాదు. రాత్రిలు అతను నన్ను కోరేప్పటి స్పర్శకీ తక్కినగోజల్లా నాతో ఆడుకునేప్పటి స్పర్శకీ స్పష్టమైన భేదంవుంది. సమయాలనుపట్టి అమీర్ నా స్నేహితుడుగా, అన్నగా, తండ్రిగా, బిడ్డగా, గురువుగా, భర్తగా, ప్రియుడుగా, అధికారిగా మారేవాడు. నేనూ అంతే. ఒకప్పుడు అతి చనువు, ఇంకోసారి కారణం లేనిదే చాలా బింకం, కొత్తలేనిదే అమిత మైన సిగ్గు, పిచ్చిదయ, కపటమైన కోపం, తల్లిచూపే లాలన, బోగందాని శెట్టూ, సత్యభామ ధూర్తత్వమూ, కలహమూ, అన్నీ రకరకాల మారి చూపేవాళ్ళి. కాని సాధారణంగా యిద్దరమూ, మా స్త్రీ పురుష భేదం మరిచి మిత్రులవలె ఆడుకునేవాళ్ళం. అట్లాకాక ప్రతినిమిషమూ, ఒకరి కొకరికి కామవికారం కలగచేస్తోవుంటే, యిరవైనాలుగు గంటలూ కలిసి జీవించగలమా? ప్రతిసౌజ్ఞా, చూపూ, కామవికారంతో స్ఫురించడం, గాలిలేని యిళ్ళల్లోనూ, యీగలుముసిరే భోజనాలసావిళ్ళల్లోనూ, పవిత్ర ప్రేమమయ సంసారాల్లోన్నూ. అంతేగాని స్వచ్ఛమైన స్థలాల్లోనూ, యెడార్లలోనూనా? అమీర్ అవతలవొడ్డుకి యీది నుంచుంటే ఆరాత్రి నిశ్శబ్దంలో యెవరో గంధర్వకుమారుడు వొచ్చి నుంచున్నట్టు కనపడే

వాడు. (స్నానం అయింతరవాత తుడుచుకోము. కొంచెం అటుఇటూ పరిగెత్తి బట్టలు వేసుకుంటాము. ) బావుండలేదూ ? అదుగో, ఏం బావుండడంలే, అంటోంది నీ పెదిమలవొంపు. నీకేం తెలుసు ? అని ధైర్యంగా అనగలను నేను.

ఇంక భోజనం. భోజనమంటే, ఒకరి కెదురుగా ఒకరం కూచుని ; ఒకరినొకరం కళ్ళతో తాగెయ్యడమన్నమాట. మెతుకులమీద బతికామా, ఆనందంమీదగాని! రుషులు వాయుబక్షణ చేసి జీవించినట్టు. మొదట్లో నేను వేరే తినేదాన్ని. కాని యెంగిలిమాటితో నన్ను ముద్దుపెట్టుకుంటో వుంటే, యేంలాభం, మడిగా నేరే మూకుట్లో తిని ? నాకు చాతకాలేదు. వేశ్యల యెంగిలి రుచులు చవిచూసికూడా, కులం నిలుపుకునే నేర్పరితనం మీ శ్రోత్రియులకి మాత్రమే చాతనవును. ఏం తిన్నానో, యెట్లా తిన్నానో, ఆ భోజనం యెట్లా సయించిందో, నాకు జ్ఞాపకం లేదు ; అర్థంకాదు. ఈనాడు మళ్ళీ 'మాఆయన' యింట్లో నేను వుండడమే తటస్థిస్తే, మళ్ళీ నెయ్యీ, పప్పూ, పులుసూ, వుంటేనేగాని ముద్ద దిగదు. కాని అమీర్ చూపుల కలవరంలో నామనసు నిండి, అతని పెదవుల రుచి నా నోటిని కరిగిస్తోవుంటే, ఏంతింటున్నానో స్ఫురణకి వొస్తుందా ?

మధ్యాన్నమంతా గొంగళీవేసుకుని చింతచెట్టుకింద పడుకుంటాము. మనదొడ్లలో చింతచెట్లున్నాయి. కాని చింతచిగురుకీ కాయలకీ తప్ప యెన్నడన్నా వాటివంక చూస్తామా ? ధైర్యముంటే, యింటికి వెళ్ళగానే, నువ్వు, మధ్యాన్నం దానికింద గొంగళీవేసుకుని వెల్లకిత్తలా పడుకుని ఆకాశంవంక చూడు. ఆ సన్నని ఆకులు కట్టే ఆకుపచ్చ అద్దాలమేడలోంచి ఆకాశనీలి నిగ్గులకప్పులమీద తెల్లమేఘాలు తేలిపోతోవుంటే......... కాని లాభంలేదు. ఆ అందం కనపడ్డానికీ, కారణంలేని ఆ ఆనందం గుండెల్లో పొంగి, ఆ రంగులబాధని స్ఫురింపచెయ్యడానికీ అమీర్ చెయ్యి నీ నడుం

మీద వుండాలి! నీ వేళ్ళు అతని మెత్తని జుట్టులో ఆడుకుంటో వుండాలి. కాంతి పచ్చని ఆకుల్లో పడితే, పెద్దమందిరాల్లో కిటికీల్లోనించి, తలుపుల్లో నించి, లోపలికి పాకి, తివాసీలు, అద్దాలు పటాలమీదనించి, అందాన్ని పొందే, విచిత్రమైన మెత్తనికాంతి వుంటుందే, అట్లా కనపడేది, ఆ చెట్టు కొమ్మలమధ్య వెలుతురు. ఒక్కొక్కప్పుడే, తమాషా రంగుల పిట్టలు వొచ్చి, కూచుని, తొంగిచూసి, చిన్నచిన్న పలుకులూ, యీలలూ, ఆ ఆకుల గుహల్లోంచి పలికేవి. ప్రేమ చూపకునేవి. నిశ్చలమైన మధ్యాహ్నం కునుకు పట్టేవేళ ఆ పిట్టలు పలుకుతో పాడుతో వుంటే మనుషులదికాని గొప్ప సంతోషం కలిగి, దాన్ని భరించలేక, అమీర్ని కావిలించుకుంటాను... చూడు. అర్ధరాత్రి చిన్నవాయువులమీద నువ్వెన్నడూ వినని కొత్తపాట చెవిని తాకితే, యేటినీటిలోంచి నువ్వెన్నడో యెరగని యేదో కొండగడ్డి వేళ్ళవాసన వొస్తే, యెట్లాగో, యేవో, మరిచిపోయిన సుందరానుభవాలు, మనసుకి తట్టవా? అట్లా స్ఫురించేది ఆశ్చర్యంగా. ఆపక్షి రెక్కల్లోంచి చిన్నయీక, గాలిలో, సోమరిగా తేలుతోవొచ్చి వాలేది నామీద, దాని పాటతోకూడా. ఎక్కడో, ఎప్పుడో, యే జన్మలోనో, అనుభవించి, అధికానందం పొందిన విషయాలు అట్లా బాధ పెడతాయి గావును మనసుని! ఆ పిట్టలన్నీ నాకు గుర్తు. ప్రతిమధ్యాహ్నమూ ఎదురుచూసేదాన్ని. ఏదో బంధుత్వము నాకూ వాటికీ వున్నట్టే తోచేది.

అన్నిదిక్కులా రాత్రి కమ్ముకున్నప్పుడు, యీదురుగాలిలో నిప్పు ముట్టించి మళ్ళీ బియ్యం వొండేదాన్ని. అంత చీకట్లోనూ గాలిలో పూగే వొకటే మంట వెలిగించడం యెంతో గంభీరంగా వుంటుంది. ఇద్దరి మొహాలమీదా వెలుగు చీకట్లో వుయ్యాలలూగుతో, పొయ్యిదగ్గిర కూచుని వుడికే అన్నపు సంగీతానికి ఆకలితో వుడికే పొట్టలు గంతులేస్తో; వొంటరిగా లోకానికంతా చక్రవర్తులవలె కూచుంటాము. ఎందుకో

విశాలమైన మైదానంలో రాత్రిలు ఆకాశంకింది మంట, యేవో యెరగని భావాల్ని కలిగిస్తుంది.

ఒక్కొక్కరోజు అమీర్ మధ్యాన్నమప్పుడు యేట్లో చాపలు పడతాడు. ఆ చాప పైట గిలగిల కొట్టుకోడమూ, దాని ముక్కులోంచి నెత్తురు రావడమూ చూస్తే, నేను భరించలేను. అతని పక్కనే బుజం మీద చెయ్యేసుకుని కూచుని, జెండు కదిలేసమయానికి అతని తలని లాక్కుని వొదలక గట్టిగా పట్టుకుని ముద్దుపెట్టుకునేదాన్ని. వుత్తగాలం అతను పైకి లాగినప్పుడు సంతోషిస్తాను. కాని చాలసార్లు వెర్రిచాప దాన్ని కరుచుకునే వుండేది. ఒకసారి నాలుగుచాపల్ని అతను చూడకుండా నీళ్ళలో వొదిలిపెట్టాను. ఏవి? అని అతను అడిగితే, పొదలోకి పారిపోయాయి అన్నాను. ఎట్లానవ్వాము? మేము స్నానంచేసేటప్పుడు ఆచాపలు మమ్మల్ని నీటిఅడుగున తాకితే, దూడలూ, కుక్కపిల్లలూ, అనేదాన్ని. స్వచ్ఛమైన నీళ్ళలో ఆడే వాటితోకల్ని చూసి, నేను పరిగెత్తేప్పటి నా పిరుదుల కదలికలాగు వుంటుందని ముచ్చటపడేవాడు అమీర్. అన్నం పడేస్తే అన్నీవచ్చి మూగేవి, పిచ్చిమాతులు జాచుకొని, వాటినెట్లా గాలంతో చంపేవాడో!

'వాటిని చంపడం పాపంకదూ?'

'పాపమేమిటి? దేముడే చంపుతున్నాడు ప్రతినిమిషమూ లో కాన్ని!'

'ఐతే మనుషుల్నికూడా తిను.'

'కొందరు మనుషుల్ని తప్పకుండా తింటారు. ముఖ్యంగా బొర్రి ప్లీడరు మరీరుచిగా వుంటారు.'

చాపలు దొరికినరోజున వేరే పొయ్యిపెట్టి వొండుకుంటాడు. కాని తరవాత వాసన! నాకడుపులో వికారంపెట్టేది. అదిచూసి క్రిమంగా

చాపలు తినడం మానేశాడు. కాని ఆధ్యాత్మిక ప్రేమగల సాధక్త, ఎన్ని సార్లు నేను యేడ్చినా, ఆముక్కసోడుం మాత్రం మాన లేదు. 'చాపల వాసన, అమీర్ నాదగ్గిరకి రావొద్దు' అంటే, ఆరాత్రింతా దూరంగా కూచుని నన్ను చూస్తో తుర్రిప్పిపడేవాడు. నేనే వుండలేక అతన్ని లాక్కొని వికారపడి కక్కేసేదాన్ని. పశుకామం! ఏంచెయ్యం?

మధ్యాన్నం గాలం యేట్లో వేసుకుని, గానుగచెట్టు నీడలో కూచుని కునికిపాట్లు పడడం ఎంత హాయిగా వుంటుందని! ఎండమచ్చలతో పోట్లాడే నీటికెరటాలనీ, తొరగా కొట్టుకువచ్చే చెత్తనీ, నురుగునీ, అవతలవేపు నీళ్ళలో వొంగుతూ లేస్తున్న తుంగనీ, దూరపుకొండల మారే రంగుల్నీ, అట్లా సోమరిగా చూస్తో, కళ్లు సగంమూసుకుని, నాజుట్టు అమీర్ మెడ మీద యెగురుతో వుంటే, అట్లానే యేమీఆలోచనలన్నా లేకుండా, యింకాకావాలనే కోర్కె, ఆదుర్దాలూ, యేమీ లేకుండా పడుకోడం సుఖాలువొదిలి పరమాత్మలో యేకమయ్యే ఆనందమంటారే— అట్లాంటిదే గావు ననిపిస్తుంది.

ఇంక రాత్రులు. ఏంరాత్రులవి! మాకు వెన్నెలవొచ్చినా సంతోషమే. చీకటిగావున్నా సంతోషమే. మబ్బుపట్టినాసరే. అన్నిట్లోనూ, ఆనందం కనపడేది. కూచోడం కష్టమైనట్టు, కాళ్లూ, చేతులూ, ఆడిపోతాయి. ఏవో ఆనందం, యేమేమిటో చెయ్యమని పురిగొల్పుతుంది. కూచుని వూరికేనే, లేచి నవ్వుతో పరిగెత్తడం, రెండోవారు వెనుక తరుముతో పరిగెత్తడం, తప్పించుకోవడం, దాక్కోడం, అందినా, అందుకోనట్టూ, అందనట్టూ నటించడం. అంతా అనుభవించగలిగినా, ఇష్టం లేనట్టూ, కొత్తవారైనట్టూ నటించడం, అలిసి కిందపడగానే రెండోవారుకూ — అక్కడే పడి........ మనుషులకుండే, బద్ధకాలూ, చికాకులూ, మర్యాదలూ, పోయి, అందమైన మృగాలవలె, పిల్లిపిల్లలవలె ఆడుకునే వాళ్ళం.

మొదట నాసౌందర్యబాధని పొందినవాడు అమీర్. ప్రపంచమంతా వెతికి, నన్నే యేరుకున్నట్టున్నాడు. ఆనాటి వుదయం ఆఫీసుగదిలో నావీపు చూడగానే, నేనే తనకి కావాలని, నేనుతప్ప యెవరూ అక్కర్లేదనిపించిందని చెప్పాడు.

ఆరాత్రిలు, యీ భూమిమీదేనా, లేక యే యింద్రజాలలోకాలలో నన్నానా, అదంతాకలా, భ్రాంతా, యీ ప్రపంచమే యింత అందంగా వుండగలదా అనిపించేది నాకు. కాని అమీర్ మాత్రం అమితమైన బాధపడేవాడు. ఒక్కొక్కప్పుడు జాలివేసేది, భయమేసేది. కాని ఆబాధే తన ఆనందమంటాడు. ఏమిటంటే—అందం చూసి వెర్రెత్తిపోతాడు అతను. ఒక నిమిషం నా వొంటిమీద బట్టని నిలవనియ్యాడు. నా రెవికలన్నీ ఒక్క పదిరోజులలో చింపేశాడు. నేను మళ్లీ కుట్టుకోలేదు. ఏంలాభం? చీరెలు చిరిగిపోయినాయి. కాని ఏమైతేనేం? చీరెలు చూస్తాడా అమీర్, నావొంటిని చూస్తాడుగాని! అక్కడ పేరంటాలా భోజనాలా? చీరెల విలవని బట్టి మనుషుల విలవ నిర్ణయిస్తారా, మీ వూళ్లలోమల్లే!

వెన్నెల వొచ్చిందంటే ఆ బయలంతా క్షీరసముద్రమూ, స్వర్గమూ, ఆకాశమూ ఐపోయేది. అమీరంతగొప్పహృదయం కలవాడు, సౌందర్యపిపాస కలవాడు, అన్నాళ్లు, మావూళ్లో, పనిలేకుండా, వూరికే యెట్లా పడివున్నాడా అని ఆశ్చర్యం వేస్తుంది. కొంతసేపు తాకితే నలిగిపోతానేమో, మల్లెపువ్వునో, వెన్నెల రేఖనో, అన్నట్టు పెదవుల చివర్లతో గాలిమల్లేనూ, మల్లెపూవులమల్లేనూ, వేళ్లకొనలతో నీటి అలలవలెనూ, కుక్క పిల్లల లెనూ తాకి, వొళ్లంతా, తిమ్మిరింతలు పరిగెత్తిస్తాడు. వూరికే ఎదురుగానుంచుని నన్నుచూసి, వెర్రెత్తినవాడివలె నాపేరు పిలుస్తో కూ మంటాడు. చేతులతో నాతలని రెండువేపులా పట్టుకుని నన్నేదో ప్రశ్నిస్తున్నట్టు, నా కళ్లల్లోకి చూస్తో అరగంట నుంచుంటాడు.

వస్తూవుండేది నా చీరెని ఒక్క వూపుతో లాగేసి నిర్జనమయిన మైదానం మధ్య నుంచోపెట్టి, చేతులు పైకెత్తించి. నా చేతుల్నీ, నా రొమ్ముల్నీ అన్ని వేపుల్నించీ, అట్లా రెప్ప వెయ్యక చూస్తో వుండుమని, నన్ను ప్రక్కలకి వొంచి నా నడుందగ్గర సాగే వొంపుల్ని తాకి, వెనకనించి నన్ను తనకేసి, వొంచుకుని నా గెడ్డంకింద వేళ్ళు కదిలిస్తో, వెడుతున్న తనానికి మురిసి ఆనందించేవాడు. నా బుగ్గాల వెనక చూస్తే, నల్లని మబ్బుల్లోని నీటిభారం తోస్తుందట. నా నడుం వొంపుల్ని చూస్తే, మారయేరు ఉప్పెన వొంగి తిరిగిన చోట కలవరపడే ప్రవాహపు నునుపు తోస్తుందిట. నా మెడమీది రేఖలు చూస్తే, గోదారి అలలమీద మెత్తని యెండ ప్రతిఫలించి, మెల్లిగా పైకి పాకే కాంతి గీతలు కనపడతాయిట.

ఇట్లా అంటో అంటో ఉప్పెన గోదావరిమీద లేచే యెండాకాలపు తుపానువలె విజృంభించి నన్ను కావిలించుకుని, వూయించి, తిప్పేసి, అలస కొడతాడు. ఒక్కొక్కప్పుడు, అతను నన్ను విరిచేస్తాడేమో, తినేస్తాడేమో అన్నంత భయమేసేది. నా మొహాన్ని ఆ వెన్నెట్లో ముద్దుపెట్టుకున్నాడంటే, నా వూపిరి ఆగి, కళ్ళు తిరిగి, చమటలు పోసేవి. నన్ను అదుముకుని ఇంకా అదుముకుని, యింకా తనతో నన్ను కలిపేసుకోవాలని అతను పడే బాధని చూస్తే, నేను బతకడమే ఇతనికి యిష్టంలేదా, ఆ కళ్ళలో వెలిగేది ద్వేషంకాదా, అనిపించేది. తన పెదవులతో, తన చేతులతో నా నున్నని శరీరాన్ని వొత్తెయ్యడం, నలిపెయ్యడం, తన కాళ్ళతో నా కాళ్ళని మెలి పెట్టి విరిచెయ్యడం చూస్తే, యితనికి సౌందర్యం విరోధమా, దాన్ని ధ్వంసం చెయ్యాలని చూస్తున్నాడా అని అనుమానపడతాను.

ఇట్లా ఒక్క నిమిషం వ్యవధిలేకుండా బాధపడి అలిసిపోయి, నిరాశ చెంది, నా పాదాలమీదపడి, "యెట్లా! యేం చెయ్యను! యెంతసేపు!"

అని యేడుస్తాడు. సిగ్గా యేడుస్తాడు. (మళ్ళీ చప్పున పళ్ళు పటపట కొరికి, దగ్గిరి వెనక్కు తగ్గి నన్ను చూస్తూ, కౌగిలించుకుని, లాక్కుని, పళ్ళ తప్పు గుహల్లో వీచే సముద్రపు తుపానుగాలివలె వూపిరి పీలుస్తూ, నన్ను బుజంమీద, చెంపలమీద, యెక్కడపడితే అక్కడ, సున్నితమైన స్థలాల కొరికి చంపేస్తాడు. అతని బరువును భరించలేక కింద పడిపోతాననుకుంటాను.) నేను బాధతో అరచినకొద్దీ, నా పెదిమల రక్తం రుచిచూసినకొద్దీ, పులివలె ఉద్రేకిస్తాడు. అతనికి పిచ్చెక్కిందేమో. నా రక్తం ఆత్రాపేక్షించంపే రాక్షసి కాడుగదా! అని వొణుకుతాను.

సగం చచ్చి పడుకున్న నాకేసి రొంటింగా పడుకుని, చేతిమీద తల ఆనుకుని, నాకేసి చూస్తూ వుంటాడు. నాకు సిగ్గయి, అతని చంపలమీద చేతులువేసి, "ఏమిటట్లా చూస్తావు!" అని అడిగితే యేమీ మాట్లాడడు. నేనట్లా నిద్రపోయి యే మూడు జాములకో లేచి చూస్తే, యింకా అట్లా చూస్తూనే పడుకుని వుంటాడు. ముక్కుకొనకంనుంచి, గుండ్రంగా యెత్తుకున్న నా రొమ్ముల గుండ్రాన్ని, నా బుజం దగ్గిర్నుంచి పిరుదలదాకా తిరిగే వొంపుని, నా చేతుల సున్నితనపు గుండ్రాన్ని, నా వొంటిమీద పొంకే అతని చూపుని చూసి తెలుసుకోవచ్చు. ఒకరాత్రి నా వీపువెనక కూచుని అతను నా జుట్టును దోసిళ్లతో పంచివేసి, వేళ్ళలోనించి జారుస్తూ, బుజాలమీద, మొహంమీద కప్పుకుంటూ, గడిపాడు నాలుగు గంటలసేపు. యేటిలో రోజూ కడిగి నూనె వెయ్యని జుట్టు నా మెడమీద ఉల్లరిగా పడటం అతనికెంతో యిష్టం. నా జుట్టు అతనికి కొత్తగా కోసిన వరిగడ్డివాసనా, ఆవు పియ్యా, గుర్రపు శుభ్రమయిన పరిమళమూ, తలపింప చేస్తుందట.

చిన్నప్పుడు మా యింట్లో శాస్త్రుల్లు భాగోతం చదువుతో వుంటే, చిన్న సంగతులు జ్ఞాపకం వొచ్చాయి. శ్రీకృష్ణుడికి సర్వప్రపంచమూ లీలగా

అసత్యంగా తోస్తుందిట. ఈభూమీ, ప్రాణులూ, నా సుఖదుఃఖాలూ, స్వప్నమూ, మాయగా, అశాశ్వతంగా తోస్తుందని, ప్రకృతి నిష్కామ మాత్రమే నిత్యమయినదీ, అగాధవంతమయినదీ, తనకి సంబంధించిందిగా, కనుక మౌతుందని చెప్పేవాడు. నా మనోస్థితి సరిగా ఇప్పుడిదిలాగు వుంది. నా యిల్లు, బంధువులు, యీ వూళ్ళు, ప్రజలు, వాళ్ళ అభిప్రాయాలు, అన్నీ మాయ. నా పూర్వ జీవితమంతా ఒక దుస్స్వప్నం. శాశ్వతమూ, సత్యమూ, అయినది నేనూ, నా అమీర్. నిత్యనిరంతరానంద దాయకమయినది, మా నిర్మల ప్రేమ సంబంధం. ఆ కొండలూ, ఆకాశమూ, నదీ, బయలూ, స్వచ్ఛమారుతమూ, మేము మాకోసం కల్పించుకున్న రంగస్థలం— అంతే. ఇంక తక్కిన ప్రపంచమంతా మాయ. మేమే—ఈ సృష్టి, దాని ఉద్దేశ్యమూ. మమ్మల్ని, మా ప్రేమని సృజించడానికే ఈశ్వరుడు ఈ లోకాలన్నిటినీ యేర్పరిచాడు.





చిన్నప్పుడు నేను పెంకెమాటలు మాట్లాడినప్పుడు ఎదిరించడానికి మాంసి నవ్వేది. కాని ఈ తుంటరి రాజ్యంలో ఆమంత్రం పారక పైపెచ్చు నేను నవ్వడం చాత, అతనికి తీవ్రమయిన ప్రకోపం వచ్చింది, దెబ్బలాటలేవీ రామనాడి యిహేల వ్యర్థమయినప్పటికీ రాముడక్కడ లే.

"సిగ్గులేకుంటే, నీ మొహానికి! అంత మరీ చెడిపోయినావ్ఏటే! ఆ తుగకవెనవ నిన్ను వొదలలేక పోవడం ఒక గొప్పగా, ఘడాయిగా..."

"ఒక్క నిమిషం వొదలలేని ప్రేమ ననుభవించడం కన్న అదృష్టం యేముంది స్త్రీకి! నీ కర్థం కాదు లే."

పళ్ళు పటపట కొరికాడు. ఇంకేం చాతగాక!

"ఎందుకరవాతుంది! కుక్కలమల్లే, పందులమల్లే..."

ఇంకేవేవో మాటలన్నాడు. చెడిపోయినదాన్ని నా నోటినించి కూడా రావు ఆమాటలు.

"పుణ్యపురుషులు బ్రాహ్మలు! మీరు మాత్రం...అంతేగా!"

ఇంక కోపం చూపించే విధం తోచలేదు మహాత్ముడికి!

"పాపం, పుణ్యం, సిగ్గూ, రాగ్గా లేకుండా రాత్రులనక పగలనక యీ అడివిలో దున్నలవలె పడి...యెందుకు యీ బతుకు బతకడం యింతకంటె దేంట్లోనన్నా పడి చావరాదూ!"

"మొదట్లో నా స్త్రీ పెరు పెనిమిటికి ఓ వారం యిట్లానే వుండేవారు తరవాత శక్తీ, రసికత్వమూ తగ్గి, పవిత్ర పురుషుడయినాడు. ఆయన్ని యేమీ అనరేం!"

"పవిత్రమయిన కాపరానికీ యీ గుడిశెల తనానికీ సాటి తీసుకొచ్చావా! నీ నోరుపడ!"

"మరి అపవిత్రమయిన కాపరంలోకంటె, యిక్కడే ఆనందంగా, ఆరోగ్యంగా వున్నానే!"

"వూరికే యింక మనసెట్లాయిాడిస్తే అట్లా పోయి, బాగా యీ శరీ గ సుఖాలు అనుభవించడమే నన్నమాట యీ జతుక్కి అంతం."

"అక్కడ వున్నా అంతేగా? తినడమూ, నిద్రా, మర్యాదా, చాకిరీ! అంతేగా! వాటివల్ల యేవో పుణ్యలోకాలు వొస్తాయని దొంగ బోధనలు పైగా."

"మరి ధర్మమూ, పతిభక్తీ, సంసారమూ యివన్నీ"

"ఎందుకు మామయ్యా, ఆ పేర్లన్నీ యాకరువు పెడతావు? ఎవరికి కావాలి అవన్నీ! తంతాడనీ తిండిపెట్టడనీ, వేరుగతిలేకా, అనుభవించడం చాతకాకా, అంతమాత్రం ధైర్యమూ, రసికత్వమూ లేకా, మొహాన్నిచూసి ముచ్చటపడే వాళ్లు లేకనేగా ఆ పతిభక్తీ పవిత్రతా! ఆ మొగుడినించి తిట్లూ, తన్నులూ తిని అడ్డమయిన చాకిరీచేసి, తగాదాలుపడి, పోట్లాటలతో కాలంగడుపుతో చస్తే, మోక్షమా! ఏ దేవుడు చెప్పాడు?"

"మరి త్యాగమంటో లేదా యేమిటి"

"నాఅమీర్ కోసం నేను చేసిన త్యాగాలూ"

"చాల్లే!
ఇంక పశువుకీ నీకూ భేధమేమిటి?"

"ఏమీలేదు. ఇదివరకు పశువుకన్న అధమమయిన జతుకుబతికేదాన్ని ఇప్పుడు పశువునై సుఖపడుతున్నాను"

"ఇంక తల్లీతోడూ......"

"అక్కడ...ఆ చిలాల్లలో...అసహ్యాలలో యెప్పుడూ జ్ఞాపకం వొస్తారు తల్లీతోడూ. సంతోషమనేది చిన్నతనంతోనేసరి, అందువల్ల అన్న

లన్నా తమ్ముళ్లన్నా అంతఃక్షేపం. ఇక్కడ యీ గర్వసౌఖ్యంలో ఎవరూ జ్ఞాపకం రారు. నిజమయిన అత్తవారిల్లు యిదే. అందర్నీ మరిపించే స్వర్గం.

"ఇంకెప్పుడూ యింతేనన్నమాట"

"అంతే"

"ఇంటికి, మళ్ళీ యింటికి రావటమూ అదీ లేదూ"

"నన్ను రానిస్తారా?"

"రానిస్తే వొస్తావా మరి?"

"నేనా వొచ్చేది! నేను రాకేం! ఎందుకు వొస్తాను!"

"ఇదే సుఖంగా వుందా నీకు? ఈ కుంపట్లూ, బొచ్చెలూ, యీ అవతారమూ—"

"ఎందుకు అంజనాలు మాట్లాడతావు? అద్దాలు లేక పోతేనేం! ఆ యేరు లేదూ? అమీర్ నేత్రసరోవరాలు లేవూ! నా సొంపు చూసుకోటానికి! అయినా అమీర్ మాపులకి బావుంటే చాలదా నా అవతారం"

మామయ్య మౌనవ్రతం పూని కూచున్నాడు. అమీర్ వొచ్చాడు.

"అప్పుడే వొచ్చావేం! మేమింకా వుపోద్ఘాతంలోనే వున్నాము. మళ్ళీ కొంచెం వెళ్ళిరా"

మళ్ళీ వెళ్ళాడు, పాపం.

"చూశావా. ఎట్లా వెంట తిరుగుతాడో, ఒక్క నిమిషం వొదలక! నా భర్తలేమో ఆ మన వారంరోజులకి ఓసారైనా నా మొహం చూసేవాడు కాడు. తలంటిపోసుకుని, తల్లో మరువం, జాజిపువ్వులు పెట్టుకుని, కొత్త సిల్కు చీర కట్టుకుని దగ్గిరికి వెడితే, కాయితాల్లో తల పెట్టుకునికి...

'మొన్న నీచేతికి పదిరూపాయల నోటిచ్చాను కదా, అదికావాలి ఓ సారి తెచ్చి యియ్యి' అన్నాడు. ఇచ్చిం తరువాత తలెత్తి చూసి,

'మొన్న తెప్పించిన శీకాయి అంతా కర్పుపెట్టేశావా?' అన్నాడు, నవ్వుతో "నేలే! అయితేమాత్రం?"

"ఎంత పొగరెక్కిందే నీకు! అతను తలుచుకుంటే యీ జానకిని జై లుకి పంపగలడు తెలుసునా!"

"ఆ, ఈ జానకి తలుచుకుంటే అయన్నీ నిన్నూ కూడా తలకాయ పగల కొట్టి యిక్కడ పాతెయ్యగలదని కూడా తెలుసుకో."

"సరే, నువ్వొక్కర్తిణ్ణించి కదిలిరావన్న మాట. నాకు ముందే తెలుసు నీ మతం. కాని వాళ్ళందరూ పోరి ఇంకా సంగతులు బయటికి రాకముందే నిన్ను తీసుకొచ్చి దిగబెట్టమని పంపారు."

"మరి నేనేమయిపోయినా ననుకుంటున్నారు!"

"పట్నంటకి వెళ్ళావని చెప్పాలని చస్తున్నారు".

"నమ్మారూ!"

"అందరికీ తెలుసులే. కాని మాతో అనడానికి ధైర్యమేదీ! మా మాట నమ్మినట్టే నటిస్తున్నారు. ఆగతికి తెచ్చావు మమ్మల్ని, నిన్ను పెంచి పెద్దదాన్ని చేసినందుకు."

"పాపం, మర్యాదస్తులకి యెన్ని బాధలు! మీ దొంగ మర్యాదలూ, ఆ..ర్దాలూ, కాపాడ్డానికి, నేనుమళ్ళీ ఆనరకంలోకి వచ్చి వుండాలా? ఎందుకు రావాలి?"

"ఎందుకేమిటి! ఏదో ఓసారి తెలివితక్కువ పనిచేస్తే, పెదవాళ్ళ మా

ట విని అన్నా సద్దుకోవాలి. ఏదో యిట్లాంటివి ప్రతివాళ్ళూ చేస్తారు. కాని అదే బావుందని, భ్రష్టవై నాశనమౌతానని పట్టుపట్టేదాన్ని నిన్నొకదాన్ని చూశానీనాటికి."

"అవును, నేను రాను."

"ఈనాడిట్లానే అంటావు. ఎన్నాళ్ళుతే వీడి మోజు! తరవాత నీకు దిక్కెవరు?"

"నారాయణుడు. కాని అమీర్ ప్రేమపోదు"

"ఆ, చాలా చూశాము!"

"సరేకాని, యీదయంతా నాకోసమేనా?"

"పోనీ అమ్మని తలుచుకో. నిన్ను పెంచి పెద్దదాన్ని చేసి, ఏదో వా అందరికీ ప్రతిష్టతెస్తావని..."

"అవన్నీ చిన్నప్పుడు కుమారీ శతకంలో చదువుతున్నాను. దానికేం! నా సౌఖ్యమే మీరు కోరేవారయితే, యిక్కణ్ణించి తీసికెళ్ళేందుకు ప్రయత్నం చెయ్యరు. అయినా నేనిప్పుడొస్తేమాత్రం లోకమంతా యెట్లా చూస్తుంది? ఆకాపరం యెంత రమ్యంగా వుంటుంది! లేచిపోయిందాన్ని చూద్దామని అందరూ రావడమూ, గుమ్మంలోకివొచ్చి మొహాలు మర్యాదగా మార్చుకోడమూ, నేను లోపలికి వెళ్ళగానే నవ్వుకోడమూ, వాళ్ళ నాసంగతేమీ తెలీనట్లె మాట్లాడడమూ, దొంగ మర్యాదలూ, యెవరన్నా ధైర్యంగలవాళ్ళు నన్ను కార్యాలకి పిలవకపోతే, నాధర్మ అవమానం నావల్ల కలిగిందని యేడవడమూ, తిట్టడమూ, దెప్పడమూ: నేనే స్వేచ్ఛనడిగినా, బైట తొంగి చూసినా, నాపూర్వప్రవర్తనని జ్ఞాపకంచేసి నోరు మూయ్యడమూ—దీనికేగా నన్ను రమ్మంటున్నావు! నేను పిచ్చిదాన్నా!"

"ఏనాటికన్నా మా గుమ్మం తొక్కావా—" అంటున్నాడు చాలాకోపంగా పైకిలేచి.

“అమీర్ వొదిలేస్తేనా! అమీర్ నన్ను వొదిలింతరవాత, నేనేమయితేనేం? ఇంక ఆలోకంలోనే శరణ్యం, మీ గుమ్మాలు తొక్కుతానని యే మాత్రమూ భయంలేకుండా బతకండి”

అమీర్ వొచ్చాడు. అతని వొంక నిదానంగా పరీక్షించి చూశాను. ఈఅమీర్ నన్ను వొదులుతాడా!

అమీర్ కళ్ళలో ఆకలి ఆడుతోంది.

“మామయ్యా నీ భోజనం సంగతేమిటి”

“నేను పళ్ళు తెచ్చుకున్నాను”

“ఇక్కడ గడ్డికూడా వుంది” అన్నాడు అమీర్.

పడమటి కొండ వెనకాల రంగుల మబ్బుల్లో శుక్రుడు అస్తమిస్తున్నాడు తామర పువ్వుమీది మంచుబొట్టు మల్లే. గాలి నిశ్శబ్దంగావుండడం వల్ల యేరు కొండమీదనించి పడేశబ్దం వినపడుతోంది. చీపుళ్లూ, నేపాళాలూ, పగలు రాత్రిగా మారే చిత్రాన్ని చూస్తూ కదలక నుంచున్నాయి. పగటివెలుగు మీదనించి రాత్రిసీమలో దూకడానికి సంశయించేదానివలె ఒక్క నిముషం ఆగింది కాలం. హృదయం ఒక్కసారిగా ఆనందంతో పొంగింది, పొయ్యిమీద వేడెక్కిన అన్నంవలె. మామయ్య అరిటపళ్ళుతింటూ యెదురుగా కూచోకపోతే, ఆ ఆరాటమంతా అమీర్ మీద కనపరిచేదాన్ని.

ఒక గంటసేపు మా బంధువుల్నీ వాళ్ళ క్షేమాన్నీ అడుగుతో కూచున్నాను. మామయ్యతో మాట్లాడుతోవుంటే మూడు నెలలకిందట నా జీవిత దృష్టినంతా ఆక్రమించుకున్న యీ బంధువులందరూ యెంతో దూరమయిపోయినట్లు తోచారు. నేను చచ్చిపోయి అన్ని బంధనాలూ తెంచుకుని మళ్ళీ వాటిని కల్పించుకునే ఆశా, శక్తీ లేక, యేం తోచక తమాషాక

ప్రశ్నిస్తున్నట్టుంది, భూలోకంనించి వొచ్చిన మామయ్యని. మృత్యువైనా అంతే గావును! యీ ప్రపంచాన్ని, ఎత్తయిన, విశాలమయిన సంబంధ రహితమయిన ఉన్నతదృష్టితో లీలగా పరీక్షిస్తాం గావును! దృష్టికోణం భేదించి, అమీర్ అనే నేత్రయంత్రంలోంచి చూసేప్పటికి అన్నివిలువలూ మారిపోయినాయి.

చివరికి అన్నయ్యకి కొడుకుపుట్టాడని విన్నప్పుడైనా నాకేమీ సంచలనం కలగలేదు. పూర్వమే అయితే నా హృదయం యెన్ని ఉత్సవాల వాసనలతో గంతులు వేసివుండును! ఆ క్షుద్రజీవనమంతా జ్ఞాపకం వొచ్చి ఆ తోచకపోవడమూ మర్యాదలూ, లాంఛనాలూ, నిష్ఠూరాలూ, అన్నీ తలుచుకుని, ఆ నరకంనించి, అల్పత్వంనించి, క్షుద్రత్వంనించి, ఒక్క మంత్రంతో ఒక్క బలమయిన ఊపుతో యీ సుందరలోకంలోకి లాక్కొచ్చిన నా అమీర్ని తలుచుకుని కృతజ్ఞతతో, ఆనందంతో తల్లడిల్లిపోయినాను. ఎంత గొప్ప సౌఖ్యంలో వున్నా, అది త్వరలోనే అలవాటై, సాధారణమయి పోతుంది, మామయ్య వంటివాడు వొచ్చి, నా అదృష్టాన్ని జ్ఞాపకం చేసిందాకా!

అమీర్ని లాలించాలని ఆకస్మికమయిన కోర్కె కలిగింది. పో మామయ్యని పోనీ. కాని యీ మామయ్యని నేనెందుకు లక్ష్యపెట్టాలి! ఎవరసలు నేనెవరు! ఈ మామయ్యమూలాన నేను పోగొట్టుకున్న నిమిషాలు యీ అనంతకాలంలో మళ్ళీ నాకెక్కడ దొరుకుతాయి? ఆవలించే అమీర్ దగ్గిరగా జరిగి, అతని భుజంమీద చేతులేసుకుని ఆనుకుని కూచున్నాను. మా కొండ వెనక నించి తెలియని చంద్రుడు కనపడకుండానే కొంత వెలుగు జిమ్ముతున్నాడు. సముద్రానికీ చంద్రుడికీ సంబంధముందంటారే, అట్లాంటదే సముద్రానికీ నా రక్తానికీ వుంది. చంద్రోదయంలో వెన్నెల యింకా విజృంభించకముందే నా రక్తం పొంగుతుంది. వెనకదాపుని అమీర్ నా చేతిని లాగుతున్నా

ను. పాపం, ఒకేమూకుట్లో అమీర్‌తో నేను అన్నం తినే దృశ్యం భరించలేక తల తిప్పుకుని, పుణ్యశ్లోకాలు చదువుకునే మామయ్యతో.

"మేము వెడుతున్నాము. నువ్విక్కడే నిద్రపోతావుకదూ, మామయ్యా!" అన్నాను.

"ఇక్కడా! మీరెక్కడికి వెడతారు!" ఆ కంఠం విని తీరాలి!

"అట్లా పోతాము."

"త్వరగా, రా," అంటున్నాడు అమీర్

"నేను వెడతాను. రైలెన్నింటికి!"

నేను నవ్వాను.

"రైలు సంగతి మాకెందుకూ!"

"పోనీ నన్ను ఊళ్ళో వొదిలిపెడుదురూ!"

"అమీర్ యిప్పుడు రాడు. నేను రానివ్వను: ఈవాళిటికి యిక్కడే, మామయ్యా, నువ్వు. ఆమూల గోనెపట్టావుంది, దాన్ని పరుచుకుని పడుకో. దోమలు లేవులే."

"ఏమీ భయంలేదుకద!"

"అప్పుడప్పుడూ ఒకటి రెండు పాములూ, ఒకటి రెండు నక్కలూ, ఒకటి రెండు తోడేళ్ళూ వొస్తూవుంటాయి" అన్నాడు అమీర్.

అమీర్ మళ్ళీ తెలుగు మాట్లాడాడు. యెన్నాళ్ళయింది విని! నా తెలుగు తురకంగా మారిందన్నాడు మామయ్య.

"రావు మామయ్యా! అమీర్ మాటలకేం?"

మేము బయలుదేరాం. మామయ్య గొణుక్కుంటున్నాడు.

"నీకు మామయ్య ఐతే, నాకేమౌతాడు!"

"తురకాడికి నీకేమౌతాడు, నీ మొహం!"

"అదికాదు, నీ పెనిమిటిని నేనైతే___"

"నువ్వు నా పెనిమిటివైతే, యింకా నీతో వుండవొచ్చునా!"

చంప ఛళ్ళుమంది.

"చెపుమా! తమాషా చేస్తాను."

"బాబాయి"

"బాబాయిగారూ, శలవు. బతికుంటే రేపు పొద్దున్న చూసుకుందాం. తమరు కనపడక ఎముకలు మాత్రమే ఘోషే నమాజ్ చేసి పాతేస్తాం. తురక స్వర్గం చూద్దురుగాని!"

ఇద్దరమూ నవ్వుతో పరిగెత్తుకెళ్ళాం. కొంచెం దూరం పోగానే నాకు జాలేసింది. పాపం, నిజంగా మామయ్య భయపడుతున్నాడేమో! ఇదివరకంతా నేను తనదాన్నిలాగు అధికారం చేసిన మామయ్యకి యెట్లా వుంటుంది, నేను అమీర్ భుజంమీద చెయ్యేసి వెళ్ళిపోతో వుంటే! వెనక్కి వెళ్ళేటప్పటికి, మామయ్య గుడిశంతా వెతుక్కుంటున్నాడు.

"మామయ్యా, నువ్వేం భయపడకు. వూరికే దడిపించాడు అమీర్. హుశా రెండు మూడు గంటలవేళ వొచ్చేస్తామేమోలే!"

"పోనీ వుండకూడదుటే! యెక్కడికి వెడతారీ అర్ధరాత్రి! ఏదన్నా పురుగూ..."

నాకు నవ్వొచ్చింది.

"ఇంకా, యింటిదగ్గిర వున్నటే, నా బాధ్యత తీసుకుంటున్నావా!"

"ఇదిగో చూడు. మళ్ళీ నీతో మాట్లాడాక వీలుంటుందో లేదో! నా మాట విని యింటికి వొచ్చెయ్యి. ఈ పాడు బతుకు..."

ఎంత ప్రయత్నించినా చెవులు మూసుకోలేకపోయినాను. మొదట బాధపడ్డాను—నావశం కాకండా యీర్ష్యపడ్డాను. దాన్ని అమీర్ ముద్దుచెయ్యడమూ, నన్ను పిలిచిన రహస్యపుమాటలు దాంతో పలకడమూ, అట్లాంటి కాంక్షతో బరువెక్కిన కంఠమే మళ్లీ వినడమూ నాకు మరణబాధని కలిగించింది. కాని నాకు త్వరలోనే తెలిసిపోయింది. ఆ వ్యవహారం ఎక్కువకాలం సాగదని. మొదట్లో మొత్తానికి మోహమంతా అతన్ని చూస్తోనే వుంది. అమీరంత రసికుడుకూడా దగ్గిర చేరితే, కరగని దాని హృదయం, రాయా, లోహమా అని ఆశ్చర్యపడ్డాను. ఆమె నన్ను తృణీకరించినట్టు కోపమొచ్చింది నాకు.

ఇంటికి వెళ్లేటప్పుడు అమీర్ ఆసంగతే యెత్తలేదు. నేను చేసిన త్యాగానికి ఒక్కరవ్వ కృతజ్ఞత చూపలేదే అని నాకు చాలా బాధ కలిగింది. మీరా మాత్రం మర్నాడు పొద్దున్నవొచ్చి నా చేతులు పట్టుకుని,

“ఎంత గొప్పదానివి!” అని కళ్ళనద్దుకున్నాడు.

అట్లా పదిరోజులు గడిచింది. దానియింటినించి యిద్దరమూ ఒకరి పక్కన ఒకరం చీకట్లో నడుస్తో పూరి వీధులకే, దీపాలకే, దూరమౌతో తొల్గించి మెల్లిగా ఒక్కమాట లేకండా నడిచి వొచ్చేవాళ్ళం. పూరు [illegible]గానే తాత్కాలికంగా అతను లోకంలో ఇతరులతో కలిసినా, ఆ మైదానంలో, ఒంటరితనంలో అమీరెప్పటికీ నావాడేనని ధైర్యం కలిగేది. ఒకరోజు ఇంటికి చేరగానే అమీర్ నామీద యెంతో ప్రేమా కృతజ్ఞతా చూపాడు. ఇప్పుడు నాకెట్లా అనిపించేదంటే—అతన్ని చూడగానే అతని కళ్ళల్లో నామీది వాత్సల్యాన్ని చూడగానే యెట్లా అయిపోయిందంటే- నా మనసు, అతనికోసం, అతని సంతుష్టికోసం యేంచెయ్యగలను? యింకా యేంచెయ్య[illegible]? యే త్యాగం నావల్లనౌతుంది? యే స్త్రీలను అతనికోసం తీసుకుర[illegible]? నా ప్రాణాన్ని, నామానాన్ని, దేన్ని అర్పించను? నేనెటువంటి [illegible] అతనికి ఆనందం కలిగించను? అని పూరికే తపనపడే దాన్ని. ఆ హృదయంలోవుండే ప్రేమాధిక్యాన్ని యెట్లాగో అతనికి అర్థమయ్యేట్టు చెయ్య[illegible]ాలనిపించేది. పూరికే కావిలింతలవల్ల వ్యక్తమౌతుందా

న్నాను. ఏటిప్రవాహంలో చుక్కలు పువ్వుల్లాగ కొట్టుకొని పోతు న్నాయి. యిసికలోంచి యీడ్చుకుంటూ పోతూన్న గాలిచప్పుడూ, ఒడ్డుక రాళ్ళమీద దొర్లే నీళ్ళగలగలా వినపడుతున్నాయి. ఒంటరిగా కూచున్న నన్ను శాంతీ, యేకాంతా గుర్తుపట్టాయి. నాముందరి పెద్దఆకాశం, విస్తీర్ణమైన మైదానం, చీకట్లో అమూలు ప్రేమించుకునే వాళ్ళిద్దరూ, అంతా యీశ్వరుడి సౌందర్యాన్ని నాకు దగ్గిరిగా తీసుకొచ్చాయి. నాహృదయం ఆనందంతో నిండింది. అమీర్ కోసం నేను ఆనిమిషానచేసిన త్యాగం పరమేశ్వరుడి కరుణను నామీద వర్షింపచేసిందేమో అన్నంత ఔన్న త్యాన్ని కలిగించింది. నాకింకేంకావాలి లోకంలో! నాప్రేమనీ, నాగతినీ, నాఆనందాన్నీ తలుచుకున్నాన్నాళ్ళు, నాహృదయంమండి. అమీర్ని తలుచుకున్నప్పుడల్లా ద్వేషంతోవుడికి, బాధలో తపించాను. కాని ఎప్పుడు నాస్వంతసౌఖ్యాన్ని, స్వంతబాధ్యతనీ, మరిచి అమీర్ ఆనందం లో నాజీవితసమస్యని ఐక్యంచేశానో, ఎప్పటినించి నాజీవితోద్దేశ్యం అతని ఆనందానికి త్యాగమే నని నిశ్చయించుకున్నానో, ఆనిమిషాన్నించి ఆ కోపమే, ద్వేషమే, అమృతంగా, మాధుర్యంగా మారి నన్ను దివ్య ప్రేమానుభవంలో ఓలలాడించింది. ఆయిద్దర్నీ, అక్కడ నాచోట, నా మైదానంలో నాబుజ మానుకున్నచోటనే ఆమె బుజం-పెనవులు అతని పెనవులమీద వాలిపోచ్చిన నాప్రేమ. రెక్కలువిచ్చి నన్ను నక్షత్రమండ లంలోకి తీసుకుపోయింది. మెల్లిగా నాదృష్టి, నాదృష్టివెంట నాఆత్మా, మైదానపుచీకట్లో ప్రసరించి, వ్యాపించి, ఆక్రమించుకుని, అంతా దాటి కొండలమీదనించి కొండశిఖరాన మెరిసే నక్షత్రకాంతిలో లీనమయింది. అమీర్నే కాదు—అమీర్నీ, నా అమీర్నీ, అతని ఔన్నత్యాన్ని ప్రేమించి అతనికోసం విరహపడి ఆఅర్ధరాత్రివొచ్చిన ఆతురకదానితో, దాని ప్రేమతో సానుభూతి కలిగింది నాఆత్మ. నేనూ ఆస్వల్పత్వాన్ని పొరగని ఆరాత్రి సౌందర్యమూ వొకటేననిపించింది. నావలెనే ఆనీలాంబరం తనక్రిందకలుగ కునే ప్రియులకు చల్లని ఆనందాన్ని కల్పిస్తోంది. అమీర్నించి నాప్రేమ త్యాగపుపక్షాలమీద విస్తీర్ణమై, లోకాన్నంతా ఆవరించింది. మన బాధతో యింకొకరికి ఆనందాన్ని కల్పించామనే జ్ఞానంకన్న గొప్పఆనందం లోకం లోలేదని అనిపించింది. నాఆత్మనంతా ఆవిస్తీర్ణపు అంధకారంలో కలిపి

తనగా మంచిదే, అమీర్ మంచివాడే, నేను చెడ్డదాన్నైనాను.

పాపం, ఒక్కర్తా వొచ్చినదోవనే, తిరుతో, వెళ్ళి దాన్ని చూసి, చాలా జాలేసింది నాకు. ఏంచెయ్యను, పాపం!—

5

ఆనాడు శరద్రాత్రి. అమీర్ వేళ్ళు నామెడమీద క్రమంగా నొక్కుతున్నాయి. నాజుట్టు గాలిలో అతనిమొహంమీద ఆడుకుంటోంది. ఇద్దరమూ ఆవెన్నెలప్రపంచములో నీడలోని ఆకొండమీద భూసౌందర్యమీక్షింపవచ్చిన దేవతలవలె నుంచున్నాము. కింద కళ్ళుతిప్పితే మాచిన్ని గుడిశా, నదీ పటాలలోని బొమ్మలవలె కనిపించాయి. ఆనందంతో నా మనసు పరవశత్వంచెందింది. పాసగా తరుముకుంటూ పావురాల్లాగు తెల్లని యీకల మబ్బులు మొగుర్తున్నాయి. మావెనక ఆపాతకోటవుంది. తిరిగి చూస్తే, దాంట్లో, మా సైన్యమూ, మంత్రులూ, పరిజనమూ, నిద్రపోతున్నట్టూ, మేముమాత్రం అర్ధరాత్రిలేచి బైటనుంచుని మావెన్నెలరాజ్యాన్ని పరీక్ష చేస్తున్నట్టూ, అప్పుడే లోపలికిపోయి హంసతూలికపాన్పుపైన విశ్రమింతేట్టూ, అనుకుని ఆసంగతులు అమీర్తో చెప్తున్నాను. ఇద్దరమూ తురకంలోనే మాట్లాడుతున్నాము.

నాతురకం మేడిశినట్టేవుంది. కాని అమీర్ తురకం మాత్రం అద్భుతంగా వుంది. అట్లాంటి దర్జా, రాజభాషకే తురకమే తగును.

"సార్వభౌమా, తమ భుజాబలంబుతో జయించి, శత్రువుల నూతుమాడ్చి, బీడుపరచిన యీ మహారాజ్యాన్ని అర్ధరాత్రి, నాకన్నులపండువుగా ఒక్కసారి, వీక్షించవలెన్యాండి. కాని ఆసౌధప్రక్కనున్న చిన్న కుటీర వాసుల్ని, అనిర్వాణ్యుల్ని, నా ప్రార్థనను మన్నించి ప్రాణాలతో వ్రదలినందుకు మీసమస్తరాజమస్తక, విరాజిత, మకుట, మణిమయకాంతి తేజమున్న మీపాదాలకు నమస్కరిస్తూయున్నాను. ఆ క్షుద్రకుటీరమునన్నున్న ఆసంపతులెవరో మీరెరుగుదురా?"

"ఆ. మన అమాత్యవర్యుడు చెప్పగా వింటిని. ఆ పురుషుడు మహా నీతియుతోక కామాంగనల చెరపట్టుటయే ఘనముగాగల ఒక తురుష్కుడు",

తేలే పర్వతశిఖరాలమీద నిద్రపోతున్నట్టువున్న ఆమహోగ్రమైన శాంతాన్నెందుకు అతను కలవరపడటం?

ఇంత వెన్నెలలో నిన్ను చూడాలి, నీటి చిన్ని అలల మీగడవలె నాట్యమాడే వెన్నెల నడుంగా తలమీద చిన్నచిన్న చిందులు తొక్కుతూ చూడాలి 'అనీ నీ వృక్షాలనీడలక్రింద నిద్రపోతాను" అని నన్ను ఒక నిముషంలో వివస్త్రను చేసి చూశాడు, ఆనందముద్రిత నేత్రాలతో.

అమీర్-తెలుగుదేశంలో పుట్టి, నన్నుపట్టుకుని యీ యెడార్లలో పడి వుండక యే పారసీ-దేశములోనో పుట్టివుంటే మహాకవి అయ్యేవాడని నా వుద్దేశ్యం.

"నల్లని గోదావరీతరంగాలమీద చూశాను, మళ్ళీ నీ జుట్టుమీద చూస్తున్నాను. యీ వెన్నెల చిందులు" అంటాడు.

నాజుట్టు మొహంమీదపడే వంపుని చూసి "నల్లని సముద్ర తరంగాల వంపుతిరిగి తెల్లని నురుగుమీద పటుగెత్తుతో మీదపడేటట్టు వస్తున్నట్లు భయమేస్తుందంటాడు." ఆర్తాతిమాత్రం, అతను చిత్రకారుడై వుంటాడనిపించింది. నన్నట్లా చూసి పొట్టదగ్గిర చేవేసి "ఇక్కడ యీ యెత్తేమిటి? యిట్లా సాగిందే" అన్నాడు.

ఇంకా నాకే నిశ్చయించలేదు, యెవరూ కనిపెట్టడం సాధ్యంకాక ముందే, కళారసజ్ఞుడు, అందమైన వొంపులు కానిదానికై నూరోవంతు భేదమయినా, తెలియగల అతని కళ్ళకి తెలిసింది

వూరికే గుడ్డిగా ప్రేమింపబడటం ఒక విషయం ప్రేమిస్తున్నారని సంతోషంగా వుంటుంది. కాని అటువంటి రసజ్ఞుడు సౌందర్యారాధకుడు, ప్రేమిస్తూ, యెందుకు ప్రేమిస్తున్నాడో, దేన్ని ప్రేమిస్తున్నాడో తెలుసుకుని, ప్రేమించే ప్రేమను పొంది, అతను ప్రేమించగల సౌందర్యాన్ని కలిగియున్నామనే జ్ఞానం గొప్ప గర్వాన్నిస్తుంది. అమీర్ చూపుల్ని నిలిపివేయగల నా శరీరంమీద నాకెంత ప్రేమ!

"నాకోసం నాకళ్ళని, మెరిపించేందుకు, నా చేతుల్ని లావణ్యవరాలతో నింపేందుకు, మీవాళ్ళు మీ బ్రాహ్మలు, తపస్సులు చేసి దేవతల్ని మెప్పించి నిన్ను కన్నారు" అనే వాడు. ఆ అమీర్ నా అందాన్ని తప్ప

పట్టా డిప్పడు. కాని నా కద ఆనందంగానేవుంది. గంతులేసే నా మనసు అతని కంఠంలోని బాధని విసతలచుకోలేదు.

"అమీర్, అది యింకా యెక్కువయ్యేట్టువుంది. లోపల యెవరో స్తలంకోసం వెతుక్కుంటున్నారు" అన్నాను.

ఎంతో సంతోషంతో అమీర్ నన్ను మీదపడి నలిపేస్తాడో, చీల్చేస్తాడో అనే భయంతో చేతులడ్డంగా పెట్టి కళ్ళు మూసుకొన్నాను. ప్రశ యాన్నాదుకోడానికి తయారౌతున్నాను. కాని అతను తల వొంచుకొని ఆలోచిస్తూ పెదవి కొరుకుతో నుంచున్నాడు.

"ఇంక రా-యింటికి వెడదాం" అని నిరుత్సాహమైన కొత్త గొంతుకతో నెమ్మదిగా అన్నాడు. నా మనసులో రాయిపడ్డది. వెన్నెల మాయమయింది. నా అమీర్ ముఖంలోని ఆ వొక్క నిర్దయగల చూపుతోనూ "ఈ యెత్తేమిటిని?" అన్న ఆ వొక్కమాటతో నాజీవితాకాశంమీద నల్లని మేఘాలు కమ్మాయి.

"చూడు, ఆసొట్టదగ్గిర వ్యవహారము నాకేమా బావుండలేదు. దాన్ని ఎట్లానన్నా వొదిలించుకో—"

"యేం చెయ్యను?"

"పోగొట్టుకో"

"నీ బిడ్డ అమీర్!"

"నాబిడ్డకాదు; దెయ్యం. బిడ్డావొద్దు మొద్దూవద్దు. చంపెయ్యి."

నేను మాట్లాడలేదు. ప్రేమకోసం అమీర్ తో వచ్చేశాను. యింక గెండో ఆలోచనలేదు. కాని యిప్పు డాపని చెయ్యడమంటే పెద్దభయం మొదలు పెట్టింది. దేనినన్నా చంపడం, ఎవరి డబ్బన్నా దోచుకోడం, అన్యాయంగా సాక్ష్యం చెప్పి ఖైదుకు పంపడం, యీ పనులు చెయ్యవలసివొస్తే ఎట్లాంటి పాపభయం తోస్తుంది, అట్లావుంది. యీపనితో దేవుళ్ళందరకీ నా < కోపంవస్తుందనీ, అమీర్ నీ నన్నూ ఎట్లానో శిక్షిస్తారనీ, వెణుకుప ఇప్పుడు అట్లానే అనిపిస్తోంది, నిజంగా శిక్షించారేమో—

అదిగాక ఏదో ప్రేమకూడా-అప్పుడే పుదయించింది, దేనిమీదనో తెలియని దానిమీద. అమీర్ పడే అసహ్యంకూడా నా యీభయాన్ని జయించలేకపోయింది. పిల్లి తన పిల్లలకైపడే రక్షణోద్రేకం నాకప్పుడే కలిగింది. అమీర్ హంతకుడైనట్లూ, నేను ఆ అనాథశిశువును రక్షించవలసినట్లూ, రక్షణకోసం అది నన్ను వేడుకుంటున్నట్లు తోచేది, అప్పడపుడు. యేమైనాసరే, నన్ను అమీర్ వదిలివేసినా, నాబిడ్డను రక్షించుకోవాలని నిశ్చయించుకున్నాను. అత నెంతబతిమాలినా నేను వప్పుకో లేదు. నాకే అర్థంకాని ఎన్నడూలేని మొండిపట్టుఒకటి బయలుదేరింది నాలో. ఆతనిమీది నాగొప్ప మోహాన్ని మింగివేయగల యింకోశక్తి నాలో పెరిగింది.

ఆకోపంతో అతనక్కడెక్కడ తిరుగుతున్నాడు. నేవొంటరిగా కొండమీద తేలే నీడల్నిచూస్తూ కూర్చునేదాన్ని. కాని అంత వొంటరి అనిపించేదికాదు. అమీర్ ఒకరోజు తాగివచ్చి నన్నుకొట్టాడు, కాని తరవాత పశ్చాత్తాపముతో ఎంతో ప్రేమచూపాడు. ఒకనాడొక దక్షిణాది చీర తీసుకొచ్చి నాకిచ్చాడు. నేను యిదేమిటా? ఇతనికి యీచీరల మీదశ్రద్ధ? అనుకుంటున్నాను.

"నాకు కనబడకుండా యిదికట్టుకో" అన్నాడు. నా మొహంమీద ఉమ్మేసినట్లయింది.

నాజీవితం యేంకావాలి? విచారం గట్టిగాపట్టుకుంది. అమీరు నాలుగైదురోజులనించి అసలు కనబడడంలేదు. నేను ఆపడక వొప్పుకుంటేనేకాని ఆతనితో యింక సఖ్యంలేదని తెలియచేశాడు. నన్నీ విధంగా వొంటరిగా నమ్మించి తీసుకొచ్చి, యెంతచెప్పినా నాభయాన్ని అర్థంచేసుకోక నన్ను యిట్లావదిలివేశే, ఆతని కఠినత్వానికి నాకు ఎంతో కోపం వచ్చింది, యేడుపొచ్చింది. ఒకరోజు మధ్యాహ్నం పెద్ద పోట్లాటయింది—

ఆ ఆరునెలలూ తాను ఎక్కడకో వెళ్ళిపోతానన్నాడు. వొద్దని నే నేడ్చాను. అయితే తనమాట వినమన్నాడు. వినక పోవడా కార
ణము చెప్పమంటాడు. చెప్పడం ఎట్లానో నాకు తెలియదు. 'సి

మాట్లాడకుండా మూలకూర్చున్న నన్నుచూచి వళ్లుకొరికి కఱ్ఱతీసుకొని బాదాడు. నేను మాట్లాడలేను. చప్పున పెద్దగా ఏడ్చాడు.

"దీని మూలానే యీపాడు పిశాచం మూలానే నీకు నాకూ చెడింద"ని నా డొక్కలో ఒక తన్ను తన్నాడు. ఎందుకో అతనిమీద, అంత కోపమైనా ఆతని కాలుని ముద్దుపెట్టుకోవా లనిపించింది. అదుగో న్యక్కారం కనపడుతోంది నీ ముఖంలో, కాని అమీర్‌ని చూచావా ?—

ఆ కోపంలో కళ్ళు ఎఱ్ఱగా రుద్రుడివలె మెరుస్తూ, ఆ పెద్దచేతులు బిగించి, అట్లాంటివాడికి అంత ఆగ్రహము తెప్పించేటంత అదృష్టం ఎవరికి కలుగుతుంది ? కోపంవచ్చింది, మోహంవచ్చింది, కాని ఆతనిపైన గౌరవం అధికమయింది. ద్రుఢంగా కోపం తెప్పించుకొని నిస్సంశయంగా కొట్టకలిగిన వాళ్ళనిచూస్తే గౌరవం వుండదూ మరి ?............

హత్యఅయినాసరే, ఆత్మహత్యఅయినాసరే చెయ్యమంటారు. తమ కోసమూ నీకోసమూ తాము చేస్తారు. యీచిన్న భయాలూ, సందేహాలూ, పాపాలూ వాళ్ళనేమీ అంటవు. వాళ్ళకి అర్థంకావు. వాళ్ళు ప్రేమ చూపినా, ద్వేషంచూపినా దేవతలే, ఆదేవతలకి చేసినట్లే ఆత్మార్పణం చెయ్యాలి. దేహాన్ని, ప్రాణాన్ని, పిల్లల్ని, అర్పించాలి. వాళ్ళ పాదపీఠాల వద్ద, యీ చప్పమొగాళ్ళు అట్లాంటిత్యాగం అడిగేటంత సమర్థులుకారు. గయ్యాళిగంప భార్య గోడుపోదపడి అరిస్తే నోరుమూసుకున్నాడు— మాపూరికరణం. బళ్లో కుర్రాళ్ళతో వున కళ్ళుముంగు కాపురం చేస్తున్నా బయట కెక్కడకొస్తుందో అని కప్పిపెట్టి కడుపులో దాచుకున్నాడు మాపూరు హెడ్మాస్టరు. నేనే యింకోడికోసం కన్నెత్తితేనా అక్కడే నరకాడూ, అమీర్; నన్నే యింకోకడు కన్నెత్తిచూస్తేనా! వాడికళ్ళుపెరికి పాతిపెట్టడూ? పతిచూడిదొచ్చి మీదపడ్డా తనని నరికినా, నన్ను వాళ్ళకు వ్రేలిచి పరుగెత్తుతాడా? విస్తరినిండా తుంపురులుపడేట్టు తిడతారు—దొంగతనంగా బుగ్గలు మెలుస్తారు. అంతేకాని దిమ్మతిరిగేట్టు అమీర్‌ మల్లే కొట్టమను యీమొగాళ్ళని! అసలు వాళ్ళ చేతుల్లో సత్తువ ఏదిస్తేగదా. ప్రతిష్ఠదేవతని పూజచెయ్యడంతప్ప యింకేమీ చేతకాదు మనపురుషులకి.

ఆరాత్రి పెద్దవాన. సాయంత్రంనించి యెడతెరిపిలేక కురుస్తోంది. దీపమన్నా లేని ఆచిన్న గుడిసెలో యిద్దరమూ కూర్చున్నాము.

ఏ నిమిషాన ఆ పైకప్పు ఎగిరిపోతుందో అనుకుంటున్నాను. జగమంతా జలమయ మయినట్లూ, మే మిద్దరమే ఆచిన్న నావలో అనంత యాత్ర చేస్తున్నట్లూ అనిపించింది. ఇంక తెల్లవారదు. తేలుతూ యే లోకానికో యే వొడ్డునో చేరుకుంటాము అనుకున్నాను. మునిగితే ఏదో అపాయం రాబోతుం దనిపించింది. అప్పుడన్నా అమీర్ ఆరాయివంటి మౌనాన్ని వదులుతాడా! ఎంతరాత్రి అయిందో తెలియదు. అప్పుడప్పుడు యోచనలలోనూ కునికిపాట్లలోనూ, మైమరుస్తున్న నాకు రోజులూ వారాలూ జరిగి పోతున్నట్టు తోచింది. యింక ఆచిక్కని ఊపిరాడని నిశ్శబ్దాన్ని భరించలేక పిలిచాను. జీర్ణమైన ఆ గుడిశలోకి, చలిగాలి, చినుకులతో సహా యీమూలనించి ఆ మూలకి పూడ్చుకుంటూ పోతోంది

"అమీర్ !"

మాటలేదు.

"అమీర్"

అంతే—

మెల్లిగా కదులుతూ చేతులతో వెదుకుతూ వెళ్ళాను—

నాకాళ్ళు అతనికాళ్ళకు తగిలి ముందుకు తూలిపడి చేతులమీద ఆనుకున్నాను. అతను కదలక అట్లనే పడుకున్నాడు. కోపంతో మండిపోవడం లేదుకదా! నేను మోకాళ్ళప్రక్కనే కూచున్నాను. అతనినిశ్వాస, వాన, హోరు చప్పుడూ! ఆకాశ భగ్గుమని వెయ్యికాగడాలతో వెలిగింది. ప్రళయం వచ్చింది మేమిద్దరము నాశనమనుకొని వొణికాను. పెళపెళ ఆకాశమూ విరుచుకు మీదపడుతూవుంది.

"అమీర్! చచ్చాను."

అని ఆతన్ని కావలించుకున్నాను.

'రాజా!'

అని నన్ను గట్టిగా కావిలించుకున్నాడు.

యేటిప్రవాహము మోగుతోంది. గాలి గదిశ గదిలోనుంచిదూసుకు పోతోంది. మెరుపులు రానీ, ఉరుములు రానీ ప్రళయమే రానీ యింక భయంలేదు, ఆ రెండు చేతులు నన్ను రక్షిస్తున్నంతసేపు.

"మెన్నాన్సక్! మన్న మెన్నాన్సక్!"

దగ్గిరిగా యింకా దగ్గిరగా జరిగి వొత్తుకొని అణిగి అయిక్యమై పోయినాను.

మాట్లాడలేనంత ఆనందములో మునిగిపోయినాను.

"అమీర్"

"అబ్బా, భరించలేను."

అంతే.

వానమళ్లీ యింకా నాలుగురెట్లుగా ప్రారంభించింది. అమీర్ మెల్లిగా "నామాట వినవా?" అన్నాడు. తనచేతులతో గొమ్ముగా నన్ను అదుముతూ——

"యీ మెత్తనిశరీరములో ఎక్కడవుంది ఆపట్టుదల ఆసాహసం?"

"పెంకితనం లేదు" అన్నాను.

"అవును"

పెంకితనం కాదని నాశక్తికి మించిన ప్రోద్బలమని చెప్పాలనుకుంటాను.

మాటలు తెలీవు. అమీరుకు తెలిసేట్లు ఎట్లా చెప్పాలో తెలీదు. మాట్లాడలేదు కాని అనేట్లు బతిమాలుకుంటే నాకోసం, మా ప్రేమ కోసం, మా ఆనందం కోసం.

మాట్లాడలేను, కాని నాకంఠం విచారంతో పట్టుకుపోయింది.

"నీకు నామీద యేం ప్రేమ వున్నదన్నమాట, అంతా అబద్ధం. నీకోసం నన్ను చావమను, నా రక్తమంతా కార్చమను, నాలంద్రని నరకమను, వెనుతీస్తానా!"

ఉత్తప్రగల్భాలు కావనీ, వెనుతీయడనీ, నాకూ తెలుసు.

నాకు వశ్యుడైనాడు. భోజనానికీ, నిద్రకీ ఇంటికి వెళతాడు. తక్కిన సమ యాల యెప్పుడు నా కెదురుగా మాటలు చెప్తూనో కూచుంటాడు. నేనేమి చేస్తున్నా, ఏమి మాట్లాడుతున్నా, చెవులూ కళ్ళు పుస్పజేస్తే. ఒక్కమా టెక్కడ మాయమౌతుందో, ఒక్క చూపెక్కడ జారిపోతుందో అన్న ట్టుంటాడు. త్వరలో ఆమీరు నాకు జ్ఞాపకం రావడమూ, నేను విచారపడ డమూ తక్కువై పోయినాయి. నా కళ్ళవెంబడి నీళ్ళు దుక్క చూశా డంటే, మీరా గిలగిల లాడేవాడు. నా ఆలోచనలోకి కొంచెం విచారం నన్ను తోచగానే నా సుఖాకాశంమీదికి మబ్బు వచ్చిందనీ, తాను గాలిననీ, వీచి మబ్బుల్ని తరిమేస్తాననీ మాటలు చెప్పి నవ్విస్తాడు. నా వళ్ళో పడు కుని పూరికే పాటలు పాడుతూ, యిటూ అటూ దొర్లుతాడు. నాకళ్ళలో పడేటట్టుని పైకెత్తేస్తూ, దాంతో, 'సీరియస్'గా పోట్లాడతాడు. నా నవ్వును తుడిచేస్తానని అల్లరి యత్నాలు చేస్తాడు. నా వేళ్ళు బొమ్మలైనట్టు గంటలకొలది ఆడుకుంటాడు. పదివేళ్ళకీ పది ముద్దుపేర్లు పెట్టాడు. వాటిని పిలుస్తాడు. మాట్లాడతాడు. అతని అందమైన బుగ్గలు నిమురుతో, అతన్ని కావలించుకుంటో, ముద్దిస్తో, నవ్విస్తో నేను కాలం గడిపేదాన్ని. అతని ఆటలూ స్నేహితుల అల్లర్లూ, చిన్న పిల్లలమీద చిన్నప్పటి ప్రేమలు, అన్నీ సంతోషంగా వినేదాన్ని. ఆ చేతులు కొంటెంగా వ్రాయిస్తో రాజకీయతో, తల ఆడిస్తో, మాట్లాడుతోవుంటే యీ నవాబు నావొళ్ళో కెట్లా వచ్చా డనిపించేది. ఎక్కడనుంచో తెచ్చేవాడు! మిఠాయిలూ ఫలహారాలూ, పాలూ పళ్లూ. ఇంటిదగ్గర తనకి పెట్టినవన్నీ, దాచి నాకు పట్టుకొచ్చేవాడేమో? రోజూ సాయంత్రం పూలదండ చేతులోలేని నాకు కనపడడు. నన్ను రాత్రి పడుకోబెట్టిగాని యింటికిపోడు నాకు ఒంటరిగా భయంవేస్తుందని. యింటికి వెళ్ళడు. నే నెంత బతిమాలినా, ఏనప్పుడైనా వెన్నెల రాత్రులు నదికి వెళ్ళినప్పుడు చందమామ రేగేటి పోతలో కనబడితే, అర్ధరాత్రి నక్క అరుపుకి మెలుకువ వస్తే, అరుద పడమట పెద్దగా అస్తమిస్తోవుంటే, ఆమీరు లేనిలోటు నన్నావరించి బాధపెట్టేది మీరా నన్నెంత ప్రోత్సాహ పెట్టి ప్రయత్నించినా వ్యర్థమయ్యేది.

"నిన్నింత బాధ పెడుతున్నాడు. వాడు నీ శత్రువు" అంటాడు మీరా.

"నేను పెద్దవాణ్ణైతే నాకోసం యెవరన్నా యింక బాధపడతారా? నువ్వు అమీర్ కోసం పడుతున్నట్టు!" అన్నాడు ఒకరోజు

ఒకసారి యాలక్కాయలన్నీ జేబులో పోసుకొస్తే వాళ్ళపిన్ని చూచి అని నీచేత దొంగతనాలు కూడా చేయిస్తున్నాడా?

"ఊఁహు. ఒకసారి నౌకరుని పసిగాన్ని బాగా తిట్టానని." ఆ మాట నాతో చెప్పడానికి ఆతనుపడ్డ సిగ్గు! ఒకరోజు ఒక్క చిన్న బాకు తీసుకొచ్చి యిచ్చి అది తలగడ పెట్టుకుని పడుకోమన్నాడు. యెందుకంత ప్రేమ అతనికి నాపైన అనిపించేది: —

ఒకనాడు మేమిద్దరమూ యేరు దాటి జీడిమామిడి గుబురులో దూరి కూచున్నాము గాలివొచ్చి రాలిన ఆకులన్నిటిని యిటూ అటూ తోసి ఆడిస్తోంది. ఆకాశాన తెల్లని మబ్బులు వరసగా లేచి బయలుదేరిపోతున్నాయి.

మీరాకి కోపం తెప్పించడం చాలా సులభం. అతని కోపం మొహం చూడడం నాకెంతో యిష్టం. అ తెల్లని చర్మంలోంచి ఎర్రని నెత్తురువచ్చి గులాబీ మోహమల్ వలె ప్రకాశిస్తుంది. మీరా తన వేళ్ళతో నా పెదిమిల మీద మెల్లగా తాళంతో పాడుతున్నాడు. నేను పరధ్యానంగా వేళ్ళని తీసేశాను. వెంటనే కోపం వచ్చి తలతిప్పేశాడు. అప్పుడింకా వుడికించాలని దూరంగా జరిగాను. నావంక చూశాడు. నేను తలతిప్పేసుకున్నాను. నన్ను పిలిచాడు. నేను పలకలేదు. బాగావున్న కుర్చీని దవ్వన తెచ్చి వచ్చి యెదురుగా వుగ్రంగా నన్ను కావలించుకున్నాడు అతని మొహం బాగా యెర్రనయింది. శ్వాస నా మొహాన తుఫానువలె కొడుతోంది. కళ్ళు తళతళ మెరుస్తున్నాయి. నా భుజంమీద రవికె పట్టుకొన్న వేళ్ళు వొణుకుతున్నాయి కొత్తఆవేశం తెలుస్తోవుంది. తననోటితో నా పెదిమిల్ని నొక్కుతున్నాడు. చాలా మచ్చికగావున్న పులిపిల్ల, రక్తం మరిగించి తిరగబడినట్లయింది. భయంలో, కోపంతో "యేమిటిది మీరా!" అన్నాను. మెల్లిగా పట్టువొదిలింది. సాయంత్రపు పశ్చిమాశవలె మెరుపుజారి మోహంలో సిగ్గు నలుపు కమ్మింది, చప్పున నన్ను వొదలి పరిగెత్తి వెళ్ళిపోయినాడు. యింక రాడేమోనని భయమేసింది నాకు. కాని సాయంత్రం మెల్లిగా తలవొంచుకుని వచ్చి వంగి నా కాళ్ళు పట్టుకున్నాడు.

"యింకెప్పుడు చెయ్యను" లేవనెత్తి గట్టిగా కౌగిలించుకున్నాను.

"నాకట్లా బాగుండదు సుమీ!" అన్నాను

"మరి నన్ను యెందుకు ముద్దుపెట్టుకున్నావు?" నా తప్పు తెలిసింది.

"మీ అక్క ముద్దుపెట్టుకోమా? పోనీ మానేస్తాలే"

"వద్దు. మానెయ్యవద్దు. నాకు కోపం తెప్పించకు మరి" అన్నాను.

అప్పట్లోని సంగతి పూర్తిగా తెలియడం కొంతకాలం పట్టింది.

అతనికి పట్టిన అదృష్టాన్ని చూసి యీర్ష్యపడి నా వంక కన్నువేసి వుంచినవారు లేకపోలేదనీ మీ రావు చెప్పిన ముందుజాగ్రత్త వృథా కాదనీ, నాకొకనాటి రాత్రి స్పష్టమయింది. నిద్రపోతున్న నాకు ఎవరో దగ్గరగా నడుస్తున్నట్టు తోచి మెలుకువ వచ్చింది చీకట్లో యింకా నల్లగా ఆకారం కనపడ్డది—

"యెవరు?" అన్నాను భయంతో.

"నువ్వెవరు?"

"ఆ దేమాయిల్లు. నువ్వెందుకొచ్చావు?"

"దారితప్పి," కంపిస్తూ చెప్తోంది. అబద్ధం.

"వూరు అటు"

"నాకు తెలీదు. కొత్తవాణ్ణి. యీరాత్రి యిక్కడ పడుకుంటాను"

"వీల్లేదు"

"నేను కదలలేను."

దగ్గిరగా వచ్చి కూచున్నాడు.

నువ్వొక్కతెవేనా?"

"వెళ్ళమంటే, నీకు కాదూ చెప్పేది?"

"వొక్కతెవూ భయంలేదూ? యెంతోసేపుండదు నేను సహాయం వుంటా నంటే సంతోషించక పొమ్మంటావేం?"

"నాకేం సహాయం అక్కర లేదు."

"సహాయ మక్కర లేకపోతే, నాక్కావలె అని చెప్పన—

నామీదికి వచ్చాడు. కంఠానికి గురిచూసిన నాబాకు భుజంలో గుచ్చుకుంది. కేకేసి, బూతులు తిట్టుకుంటూ పోయినాడు. మర్నాడు నుంచి మీరా యెంత తిన్నో, మొగాడంత దాన్ని. నాకు సాయం వచ్చుకోబెట్టాడు కొన్నాళ్లు.

ఆరాత్రి దీపావళి వెళ్ళిన పౌర్ణమి. యాడాదిక్రింద ఆరాత్రి అమీర్‌తో నేను గడిపిన గడియలు ఆచిన్న నవ్వులోనూ, ఆకొండలమీది వెలుగులోనూ, అవ్యక్తమైన పరిమళంలోనూ జ్ఞాపకం వస్తున్నాయి. వ్యర్థంగా శూన్యంగా నేను గడుపుతున్న కాలపు దుర్భరత్వం మనసుకిగాఢంగా నాటుతోంది. మీరా నా వళ్ళో పడుకుని మాట్లాడుతున్నాడుగాని అతని మాటలన్నీ చెవికి మధ్యమధ్య మరచిపోయి పరధ్యానంగా వూంకొడుతున్నాను—

"నువ్వు వినటంలేదు."

"కాని—"

"వినటంలేదు. ఏమాలోచిస్తున్నావు?"

ఇట్లాంటి వెన్నెలలో అమీర్ ఒక్కనిమిషం యిట్లా తీరుబడిగా తోచకుండా కూచోనిచ్చేవాడా?

"మాట్లాడవేం?"

"అబ్బా, మధురమైన అమీరు ఆలోచనలలో మునిగి కలలన్నా కననీకండా యీమీరా యేమిటిగోల!

మీరా నాకెంత ప్రేమాస్పదుడైనా, అమీర్ ధ్యాస తిరగబెట్టిందా యింకనా మనసంతా అతని ఆయత్తమైన ప్రపంచానే మరిపిస్తుంది.

"వుండు, మీరా"

ఆనాడు అమీర్ కొండక్రింద ప్రవహించే యేట్లోకి నన్ను తోస్తానని బెదిరించాడు. నేనతని మెడపట్టుకొని వేళ్ళాడ్డమూ నన్ను కాపాడుకుని, అమ్మా నాదాన్ని దాని ప్రాణాన్ని నేను ఒక్కరవ్వ విసుస్తానా?" అనడమూ ఆకొండ పెద్ద నల్లరాతిముందు నన్ను కూచోబెట్టి తను కొంచెం కిందికిదిగి నన్ను చూస్తో అక్కడకు చేరిన ఆనందాన్ని ఆశ్చర్యాన్ని వెలిబుచ్చడమూ, పిచ్చిపాటలు పాడుతూ ఆవెన్నెలనంతా దగ్గరగా చేర్చి బట్టని చేసి, నాకు కట్టుకోడానికిస్తానని నవ్వడమూ, నిద్రపోతానంటే వెన్నెల

వృథాఅవుతుందని చంద్రుడు వచ్చగా పెద్దగా పడమర కొంగేవరకూ మాటి మాటికి మూతపడే నాకళ్ళని బలవంతంగా తెరిచి చూపుతో వుండడమూ—

"మీరా యేదీ?"

లేచి పిలిచాను.

యింటికి వెళ్ళాడా?

లేచి సగం వెతుకుతూ సగం ఆలోచిస్తో తిరుగుతో వున్నాను మీరా కూడా వెళ్ళిపోయినాడా నన్ను స్త్రీ పరిదాన్ని జేసి యీరాత్రి ఏటి ప్రక్కన పడుకొని కనపడ్డాడు యిసికలో "మీరా"

కదలలేదు. లేపాను. ఫూయించాను. యేడుస్తున్నాడు.

"యెందుకోయి?"

"యేమిటి మీరా? నాయనా మాట్లాడు. మనసుకి తట్టింది.

"నీతో మాట్లాడలేదనా?— అవునా? చెప్పు నన్ను క్షమించు. నిజంగా చాలా దిగులుపడుతున్నాను యెప్పుడో ఒకప్పుడు అట్లా మరుపు వస్తే యింత ఆగ్రహిస్తావా? లేదు. యేం? నిజం అట్లా అనుకుంటావా? కాదు. నిన్ను నిర్లక్ష్యం చేసి కాదు. కాదు కాదు—"

యేమిటీ? నువ్వు నాకు చవక కాలేదు యెన్నటికీ కావు. నాతో మాట్లాడవూ?"

కాని మీరాకి ఆగ్రహం తగ్గలేదు ఎంతో బతిమాలాను.

"పోనీలే అమ్మా! అంతకోపమైతే" నాకు విసుకూ రోషమూ వస్తున్నాయి. అమీర్ లేని గాథ యెడబాటు వులోంగా ఆ నా అందమైన వెన్నెల. కూ బలిచేసి వెళ్ళిపోయిన నానాథుడి క్రూరత్వం నన్ను కోస్తోంది. జీవితం దుర్భరం. జీవితం నిష్ఫలం. నాకింక ఆనందం లేదు. యింక ఆశలేదు ఎందుకు బతికి? నన్ను వెక్కిరించినట్లు యీసౌందర్యమంతా యేమిటి?

"మీరా? ఎందుకు నన్నిట్లా యేడిపిస్తావు?"

మీరా లేడు.

వొంటరిగా ఆనంద సైకతాన కూచున్నాను మా సౌనాలు, మాప్రేమ, మాయీతలు, మాసరసాలు, అన్నీ అనుభవించిన యేరు—నన్ను చూచి

యెట్లా పెంచను? యేంచేసుకోను? పోషణయెట్లా? మా ఆనందానికి, మా షికార్లకే ఆటంకమనేకదా? అమీరు యీకోపు పెద్దన్నది. అనుకున్నాను. ఆపిల్లను పాలిచ్చుకుంటో ఆపిల్లయేడుస్తు సమదాయిస్తో దాని మురికితో నిండి ఆధ్యాసలోనే మునిగి......ఆవిద్ధ నాప్రేమను నాశనం చెయ్యదా? నాకంటే దూరదృష్టికలవాడు అమీర్ అతనికి కోపంవచ్చిందంటే తప్పా మరి,

ఇప్పుడు నన్ను అమీర్ వొదిలివెడితేనే దిక్కుమాలిన పక్షినైనానే, ఆపిల్లతో సహా యేనాడో నన్ను వొదిలేస్తే, యిద్దరమూ యేమైపోతామని? ఇప్పుడు బతుకు దుర్భరమైతే యేగోదాట్లోనో మునిచి అంతంచేసుకోగలను నాబాధని! అప్పుడో దానికోసం బతకాలి, అదో బంధం!

ఎంతమూర్ఖురాల్ని! అనుకుంటో వుండగా వొచ్చిందామనిషి.

"నెలలేమిటి?"

"మీరాగారి అక్కగారు నన్ను పంపించారు."

"ఎందుకు?"

తెలిసింది.

చెప్పుకోనా?

కాని నాచిన్నిపాపని నన్ను నమ్ముకుని నాలో దాక్కున్న పాపని... కాని మళ్లీ అమీర్ రావడమూ, నేనూ అతనూ ఆమైదానంలో పూర్వం మల్లేనే......

"సరే" అన్నాను.

ఒక్కమాటలో, ఒక్కతలవూపులో యీనాస్వప్నం చెదిరిపోతుంది. మళ్లీ మెళుకువ వొచ్చేప్పటికి, మళ్లీ అమీర్ నాపక్కన వుంటాడు మళ్లీ జీవితమంతా ఆనందమయమవుతుంది, ఈపిల్లలేకపోతేనేం? కాలమంతా గంతులువేస్తో, నాముందు నవ్వుతో పరిగెత్తుతో వుంటే! ఎంత వెర్రివాళ్లీమనుషులం! ఆశపడి నవ్వుల్ని చేతుల్నిండా పోగుచేసుకుని అతి ఆశతో గుప్పెట్లు తెరిచి చూసుకుంటే, భరింపలేని కన్నీళ్లుగామారి కనబడతాయి

ఆమూడురోజులూ యమబాధపడ్డాను. యింక మీరా నన్నంటి పెట్టుకొని నాకుపచర్యచేస్తో నాతోకలిసి పడ్డవేదన రుణం యెన్నిజన్మాలలో

ఏక్కడోగదా? నాదించి యేమాత్రం ప్రత్యుపకారమూ ఇస్తుందనే ఆశైనా
లేక నాకు చూపిన అల్లాంటిప్రేమను పొందిన నాజీవితాన్ని తలచుకొంటేనా
ప్రశస్త్ర పొంగిపోతుంది నన్ను తాకతో నాజుట్టు దువ్వులో, నానోట్లో జావ
పోస్తూ, 'నిద్రపోవా?' అని ప్రతిక్షణం అడుగుతో. నాకళ్ళలోకి చూస్తూ
నాదగ్గర కూర్చొని నాపక్కన కూచుంటే, నిజం, యింకా నాలుగురోజులు
బాధతో పడుకోవాలనిపించింది.

అనుర్దాతో వెలవెలబోయ్యే అతని మొహం చూస్తోవుంటే నాబాధ
మరచి అతనిభాధకై బాధపడేదాన్ని. నేనొక్క పెద్దమూలుగు మూలిగినప్పు
డల్లా ఆతను నిలవిలలాడి వాడిపొయ్యేవాడు. అతనికళ్ళలోని వ్యధని
చూడలేక ఆనొప్పివంతా కుక్కుకుని కళ్ళుమూసుకు పడుకుంటే, మళ్ళీమళ్ళీ
పలకరిస్తాడు, నేనెటుతిరిగితే అటు వచ్చి కూచుంటాడు. నేను నిద్రపోతూ
వుంటే పాదాలదగ్గిర తనతల పెట్టుకొని పడుకొని నేను కదిలినప్పుడల్లా
చప్పునలేచి కూర్చుంటాడు. నామీరా పురిటిస్తారుట అత్తన్ని యామవుతుందో
ఆ అందం అతని హృదయం యేగులాబీ పువ్వులకి కొత్తరంగు యేనక్ష
త్రాలకి కొత్తమెరుపు యేమబ్బులకి కొత్త నునుపు నిస్తుందో? యేదేవతల
హృదయాలకు కొత్తజాలిని యేగంధర్వుల బాహాలకు కొత్తరసన, యేకన్నె
పల కంఠాలకు కొత్తసొంపు నిస్తుందో? మీరా! మీరా!

ఆరాత్రి నేను పక్కమీదపడి మూలుగుతున్నాను. అంతసేపు నా
పక్కమీదపడి కూర్చున్నమీరా! కండపట్టుకొని యేటిదగ్గిరకు వెళ్లాడు.
మీరా తెచ్చిన లాంతరు గుడిసెలో వెలుగుతోంది. గుమ్మంలోనుంచి
బూతులతో నల్లని గడ్డంమనిషి వస్తున్నాడు. వాడే ఆనాటిరాత్రి గడ్డం
వాడని నాకు వెంటనే తెలిసి ప్రాణాలెగిరిపోయినాయి వాడు తాగివుండక
పోతే నాస్థితి అర్ధమై వెళ్లిపోయేవాడేమో! మీరాకోసం పెద్దకేక వేశాను.
వాడు లోరగావచ్చి నాచేతులదిమి మీదపడి అల్లరిచేస్తున్నాడు. వాడితో
పెనగిడానికై నాశక్తిలేదు మూలిగాను బతిమాలాను యింకారాలేదేం
మీరా? వొచ్చినామాత్రం యీరాక్షసి యెదట మీరా యేమిచేయగలడనే
ఆలోచనతోచనేలేదు. మీరాని ముందే పైటవాణ్ణి పైటనే యామన్నాచేసి
లేదుకదా వీడు? నామూలాన, నాకోసం, మీరాగతి యామయింది?
ఆతలప్పుతో నాఅవస్థని నేను మరిచిపోయి, అతనికోసం గోలపడ్డాను.

నన్ను రక్షించుకునే ధ్యాసే రాలేదు. ఐనా యేంచెయ్యగలను? వాడు నన్ను కిందికి అణిమి, మరీ అశక్తురాలినిగా చేశాడు. కళ్ళుతిరిగి బలహీనంతో మూతలు పడ్డాయి. ఎంతసేపయిందో! పెద్ద కేకలు! వినబడి కళ్ళుతెరుచుకున్నాయి మీరాని వాడు మెడపట్టుకొని లాక్కుపోతున్నాడు రక్తం కనబడ్డది. మళ్ళీ, స్పృహతప్పి పడిపోయినాను. నేను లేచేటప్పటికంతా నిశ్శబ్ధం దీపం మాత్రం వెలుగుతోంది. మీరా లేనిసంగతి మొహానకొట్టినట్టై నాకు దిమ్మతిరిగింది. ఆ రాత్రి నేను పడ్డబాధ యీలోకట్టువారు నన్నురీతి నెవ్వరు కూడా పడరు. అంతేకావాలి అనుకుంటున్నావు. అల్లాంటి బాధ నామీరా, నాప్రాణం దానంజేసి, నాకోసం బలిపడ్డ మీరాకోసం పడ్డ తపన, యెంత ప్రేమలో నించి వచ్చి వుండాలి? అది ఆలోచించు ఆ ప్రేమ చాలదూ?

నేను పెద్ద రక్తపు మడుగులో దొర్లుతున్నాను. దాహంతో నాలిక లోపలికి లాక్కుపోతోంది లేచి నిల్చుందామనుకొన్నాను. మీరా? మీరా యేడి? యేమైపోయినాడు? చప్పున నాకొక్కముందు ఇందాక చూసిన పటం కనబడ్డది. ఆ రక్తం! వాడిచేతుల్లో కత్తి! వాడుపోనీ, తనదుర్మార్గం నెరవేర్చుకొనడానికై నావెనక్క రాకపోవడం? యేంజరిగింది? తలుచుకొన్నకొద్దీ భయమేస్తుంది యెక్కడ యేమూత్రంలో పారేశాడో! యిప్పుడే గోతులో కప్పిపోటుతిని మూలుగుతున్నాడేమో, మధ్యాహ్నం నా మెడ చుట్టూ చేతులేసుకుకూచున్న మీరా! అక్కడైనా. ఆ బాధలోనైనా నన్నే తలుచుకుంటూ వుంటాడు, ఏమైనానోఅని. నా కాళ్ళుచేతులు ఇటూఅటూ కొట్టుకొన్నాను. యేమిచెయ్యాను? తీసుకరాగలిగితే! యెవర్నినా పిలవగలిగితే! తమాషా మీరావస్తే చంపుండును అతన్ని పంపిస్తును. అని తోచి, యేడుపొచ్చింది. యింకేంమీరా? వాళ్ళఅమ్మ యేమయేడుస్తుంది? నన్నెంత తిడుతుంది? ఆమెకన్నా తెలియజేయగలిగితే! లేవపోయినాను; కింపడ్డాను. మళ్ళీ!

గుడిసె తలుపులోనుంచి నక్షత్రాకాశం కనబడుతోంది. దాని వెనక నుంచి చంద్రవంక విచారంగా వుదయిస్తోంది. అయఃక్రసిరేఖ యముడు ప్రాణులపై పంపిన మరణపాశమువలె కనబడ్డది దానిక నామీరా కనరా తున్నాడా? యేగోతులోనో రక్తముకారే మీరాను చూచి కాండుకదా. అ

అరుణకాంతి? నక్క కూస్తోంది యేగోతిలోనో. మీరాశవాన్నో వెన్నెట్లో చూసి కాదుకదా? అయ్యో మీరా? ఆయేరట్లా యేడుస్తుందేం యీ రాత్రి! దాంట్లో పారెయ్యలేదుకదా! మీరానిచంపి! యీదాహంయెట్లా? లేవలేను? యెందుకు లేవడం! యెవరికోసం! కాని యీబాధ: యింకెవరో స్త్రీవేవు! మీరా పోయినతర్వాత? యింతే, నేనట్లా చావవలసిందేగా? అంతేకావాలి. అమీరువచ్చి చూసి తన క్రూరత్వమువల్ల యేంజరిగిందో తెలుసుకొని. పశ్చాత్తాపంతో మండిపోవాలి. కాని, అతనికేం? యింకెవరినో తెచ్చుకుంటాడు. యిప్పటికప్పుడే తెచ్చుకొన్నాడేమొ. యీఘోరానికంతా అతనేకారణం అతనికోసం నేనీ తీవ్రత్యాగం చేశాను. చాలాకోపం వచ్చింది, అట్లాంటి క్రూరుణ్ణెట్లా ప్రేమించెనా అనుకొన్నాను. మీరా నన్నింత ఆక్రమించుకొన్నాడు. మీరాకోసం దేవుణ్ణి ప్రార్థించాను. వాళ్ళ అల్లాను వేడుకొన్నాను. "మీవాడిని మీరాను రక్షించమని" కాని అమీరుని రప్పించమని యేడ్చినప్పుడు నామొర నెవరు విన్నారు? పోనీ అమీరు, రాకపోయినాసరే! మీరానురప్పిస్తే చాలునన్నాను. తన ప్రాణాన్ని నాకు ఆహుతిచేసిన ప్రణయ ధీరుడు నామీరా. కాని పాపాత్మురాలిని నాయేడుపు దేవుడు వింటాడా? యెట్లా తెల్లవారిందాకా యీ "సస్పెన్సు" లో కాలం గడపడం! తెల్లవారితే మాత్రం? పోనీ. చచ్చిపోకూడదా? కాని మీరా ఒకవేళ వచ్చి నేను చచ్చివుండడంచూచి యేమవుతాడు! దాహం యింక బతకలేను. దాహం. బలవంతంగా లేచి కూచున్నాను బట్టలన్నీ రక్తంతో తడిసిపొయ్యాయి ఆరక్తంమధ్య చిన్నినోరెరుగని పిల్ల! చిన్నకళ్ళు మూసుకొని, చిన్నకాళ్ళు పొట్ట అన్నీ—భరించలేకపోయినాను. కళ్ళుతిరిగి పడిపోయినాను గావును—మళ్ళీ మెళుకువ వచ్చింది. భయమేసింది. ఆగుడిసెకి, ఆమైదానానికి. ఆపిల్లా నేనూ! అదీ "అగికదలితే లేచి బైయటికిపోతే! చంపినందుకు నామీదకసితీసుకుంటే! ప్రేమా దిగులూ మాయమై, భయం పట్టుకుంది. భరించలేని దాహము! అమ్మా! ఏంబాధ పడ్డానో! ఆరాత్రి ప్రతినిమిషమూ చస్తాననుకున్నాను. ప్రతిచప్పుడికీ వులికిపడి వణికాను. కాని చావను. నిద్రోమూర్ఛ'! మృదుపార పద్మాల చప్పుడు నాహృదయం మీద కొట్టిలేపింది. వేగుచుక్కలోనుంచి వూడి

పడ్డాడు. నామీరా. పీక్కుపోతున్న నాలికతో—'' వొచ్చావా? నామీరా?
"నువ్వేమైనావు'' చెప్పు అన్నాను.

చెప్పక "నువ్వెట్లావున్నావు?'' అంటో నారక్తాని చూసి పెద్ద కేక
వేశాడు.

"నిన్నేంచేశాడు?''

"ఏమీ చెయ్యలేదు. అసలు మళ్ళీరాలేదు.''

"రాలేదుకద? ఆరక్తమేమిటి?''

సిగ్గుతో నేను మాట్లాడలేదు.

"తాగడానికి నీళ్ళియ్యిముందు.''

నాకు నీళ్ళిచ్చి, శుభ్రంచేసి పడుకోపెట్టాడు. నాకు వేరే చీరలేదు.
దుప్పటి కప్పుకున్నాను.

"అదంతా యేంచేస్తావు?''

నాచిన్నపాపని బట్టలో లుంగచుట్టాడు.

"పారేస్తా!''

"నువ్వా! నీచేత యీపనికూడా చేయించుకుంటున్నానా, దౌర్భాగ్య
రాల్ని!''

"మాటాడకు.''

వెళ్ళివొచ్చాడు.

"ఎక్కడ పారేశావు?''

"ఇంకనీకు కనపడదు.''

ఏందుకో ఆపిల్లని దిక్కులేకుండా పారెయ్యడమంటే నాకు కష్టం
గావుంది.

"నువ్వేమైనావో చెప్పు. నీకేం అపాయం వొచ్చిందో అని''

"నేను యేటినించి తిరిగివచ్చి వాణ్ణి చూచి వెంటనే మీద పడ్డాను.
మావాళ్లు వాడికి బాగా తెలుసును. నన్ను లాక్కెళ్ళి చెట్టుకకట్టేసిపోయి
నాడు. మళ్ళీ నీదగ్గరికి వొచ్చి యేంచేస్తున్నాడో: నువ్వేమైనావో! నీ
దాహంతో నీ బలహీనంలో, అని నా భయం. ఆమెని తాకావా 'నిన్ను

చంపిందాకా, నేను నిద్రపోవనని "అన్నాను. కాని కుర్రవాణ్ణి నా మాట లక్ష్యం చేస్తాడా ? అని సందేహమేసింది. వాడు వెళ్ళిన నిమిషాన్నించి ఆతాణ్ని కొరుక్కొని, కొరుక్కొని యిప్పటికి వొదిలిందనుకున్నాను" అన్నాడు

అతని నోరంతా రక్తమే ! మెత్తని చేతులు నలిగిపోయినాయి. శ్వాళ్ళబిగుతుతో. ఇంతా ఓర్చుకొన్నావా బాబు ? యీ మాటలు చెప్పి నా చేతుల్లోకి తూలాడు అట్లానే పుత్తరెంటికి అతన్ని గుముకొని ఇద్దరమూ నిద్రపోయినాము. మధ్యాహ్నందాకా.

## 8

రమ్మని అమీర్‌కి మీరా కబురు పంపాడు. కాని అతను వస్తా డంటే నాకు అర్థంకాని భయం పట్టుకుంది. రాకుండావుంటేనే బాగుం టుందేమో ననిపించింది. అతను రాగానే మీరాతో జరుగుతున్న యీ మధుర స్వప్నంలోంచి మెలకువ వస్తుందని భయం.

ఇట్లా ప్రేమ మారడం. ప్రేమలో సందేహాలు రావడమూ, ఒకే సారి యిద్దరిమీద నిజం వున్నట్టు తోచడమూ, ఆ ప్రేమే, చెరొకరి మీదా, చెరొకవిధంగా, వేరుకారణాలవల్ల కలిగినట్టుండటమూ, ఇదంతా మీవంటివారు వొప్పుకోరు. "వొళ్ళు కొవ్వెక్కితే, అట్లానే వుంటుందిలే. శుకామం" అంటారు. అట్లా ఇద్దరిమీద వుండడం అసంభవమని, తమ నీతిశాసనాలతో సృష్టి నే ప్రపంచంలోని హృదయాల్ని పాలించి అదుపులో పెట్టాలని ప్రయత్నిస్తున్నట్టు వ్రాస్తారు కొందరు, పుస్తకాల్లో! మీవి గాలి మాటలు నావి రక్తపు అనుభవాలు.

నారకంలో జులకింద తేగదా. అమీర్ని అంత గాఢంగా కోరాను! యీబాధంతా. అతను రావాలనేకదా, అనుకున్నానుగాని ఆమూడు రోజుల నరకమూ నాకు మీరాని అపరిమితంగా సన్నిహితుణ్ణి చేసింది మీరా నాజీవిత వృత్తాన్నంతా వినవేసుకున్నాడు. నేనుపడ్డ యమబాధంతా మీరాఅనే మంత్రంతో ఆనందమయంగా కనబడుతోంది. మళ్ళీ జబ్బుగా పడుకుంటేనే నేమనుకున్నాను. మీరా నాకుచూపిన మహాప్రేమ. ప్రవాహం. అవసరంలేక సన్నగిలింది. మళ్ళీ ఆతీవ్రత్యాగం అవసరమై నా

కోసం ప్రవహిస్తే అతని ప్రేమ ననుభవించాలనిపిస్తోంది. కాని అతని రుణం తీర్చుకోగలనా? ఏంచేస్తే తీరుతుంది?

ఒకనాటిరాత్రి మీరాని పిలిచి చెయ్యిపట్టుకుని పక్కన కూచోపెట్టుకున్నాను.

"మీరా, నేను నీకు కావాలా?"

అర్థంగాక నావంక చూశాడు.

"ఆవాళ మధ్యాహ్నం——"

అర్థమయిందని నాచేతులోని అతనివేళ్ళు నాకు చెప్పాయి అతనిదం వల్లాని సిగ్గుని చూసి మురుస్తో

"నీకు కావాలిస్తే యీరాత్రి అయినాసరే"

"నీకవసరమా?"

"నాకిష్టమే"

నాకు సిగ్గేస్తోంది.

"అదికాదు నేను నీకు అవసరమా? అమీరువల్లె కావాలా?"

ఎంత ఔదార్యమో! ఎంతలోతైన నాజూకైనా స్వభావమో. అతన్ని గట్టిగా పక్కకు అదుముకుని మొహాన్ని తిప్పుకుని ముద్దుపెట్టుకున్నాను. నేను వదిలినా అతనివేళ్లు నాజుట్టులోనించి కదలలేదు.

"నీతో అబద్ధం చెప్పలేనోయి. నేను అమీర్‌దాన్నే అనిపిస్తుంది. అందుకనే నాకిష్టముండదు. నేనేం గొప్పదాన్ని! పతివ్రతనీ అనికాదు

"అయితే యెందుకడిగావు?"

ఆప్రశ్న నన్ను గుచ్చుకుంది. సిగ్గుతో.

నిన్ను సంతోషపెడదామని. యెందుకంటే, నేను అమీర్‌దాన్నైనా, అతని మీదకంటే నీపైనే నాకు ప్రేమయెక్కువ"

మీరామాటలు తప్పించి యేవో మాట్లాడి వెళ్ళిపోయినాడు. అలాంటివాణ్ణి మళ్ళీ చూస్తానా? తురకలు తురకలని గుమ్మంలోనికి రానియ్యరు, పవిత్రులైన మీరందరూ "ఛీ. ఛీ. అమీరువస్తే?" అన్నాడు ఒకరోజు.

# మైదానం

"ఏమిటి?"

నాకు భయంగావుంది"

"భయం?"

నాకు తెలుసు కాని అడిగాను. ఆడదాన్ని

"చెప్పుకోడేమో?"

"ఎందుకమీరా?"

అడిగాను. కాని ఆప్రశ్ననన్ను బాధిస్తోంది.

"మనమింత స్నేహంగా వుండడం"

"తప్పేముంది!"

"లేదుకాని అతనేమను కుంటాడో!"

"అంతమాత్రం విచక్షణ లేనివాడా!"

విచక్షణ వుంటుందా?

"నాకుభయమేస్తోంది" అన్నాడు.

"భయపడకు నేనున్నానుగా......

"ఎందుకు! నిన్నేమైనా చేస్తాడని భయమా! నేను కాపాడనా!"

అమీర్ నామాటవినడా!

"నన్నా నన్నేమి చెయ్యడు నాకాభయమేమీ లేదు. పోనీ నష్టం చేసినా చెయ్యనీ ఏంచేస్తేనేం? అదికాదు నిన్ను" అంటున్నాడు మీరా.

"నన్నేమి—చెయ్యడు"

"నీ కేమీతెలీదు"

"నాకంటే పెద్దనాడి మల్లేమాట్లాడుతున్నావే"

"నాకులోకం తెలీదనా? అమీరుసంగతి తెలీదనా! నాకంటె ఏం పెద్దదానివి నువ్వు! నీకేం తెలుసు?"

నిజమే. నే నీతనికన్న యెమాత్రం పెద్దదాన్ని! ఆడదాని గనక అట్లామాట్లాడుచున్నాను కాని—యిలగా అన్నాడుగదా.

చూడూ ఎంత బాపున్నావో! నీకళ్ళల్లో కొత్తకాంతి వెలుగుతోంది.'' అన్నాడు.

అవే అతని మొదటిపాటలు నేను తనకోసం చేసిన త్యాగం సంగతి యెత్తి నన్ను మెచ్చుకోని లాలిస్తాడని పడుతున్న ఆశభగ్నమై, నన్ను బాధపెట్టింది. ఆసంగతి సూచంగా ఒకటి రెండు సార్లు యెత్తినా, అతను వినతలుచుకోలేదు.

అమీర్ లేని నాలుగునెలలూ, అసలు కాలంలో లేకుండాపోయి నట్టేవుంది. తలుచుకున్నా నాకు ఆకాలం జరిగినట్టే తోచదు. ఎప్పుడూ మేమిద్దరమూ అనాదినించి, సృష్టిపూర్వంనించి అట్లానే కలిసివున్నామనిపించింది. మేమిద్దరమూ లేకండా యీసృష్టి వెలుస్తుందనిగాని, ఆ యేరు ప్రవహిస్తుందనిగాని, ఆకాశం అంత నీలంగా మెరుస్తుందనిగాని, ఆగడ్డి అట్లా యెత్తుగా యెదుగుతుందనిగాని, వూహించలేను.

“మనం పోయింతరవాత యీగుడిశలో యెవరున్నా వుంటారో, పాడుపడి, నక్కలు కూచుంటాయో?'' అని అమీరంటే——

''మనం లేకపోవడమేమిటి?'' అన్నాను. పూర్వంవల్లనే, సంతోషంగా గడిపాము వారంరోజులు. కాని అర్ధరాత్రి అతన్ని అనుకుని ఆకాశపు నలుపులోపలికి చూసేప్పుడు, అతను మెల్లిగా చల్లనిగాలిలో పాడుతూ వుండగా, వెనకనించి నేను అతని కన్నువేసి చూస్తే, యెప్పుడో శ్వాసతోనే ఆకాశాంతం విరిగి నాతలమీద పగిలేట్టు బద్దలై పడుతుందని భయం వేసేది. అంత సంతోషంలోనూ కూడా నాహృదయం, ‘మీరా! మీరా యేదీ, రాడేం?’ అంటోంది. కాని నోరు నొక్కునుదాన్ని.

అమీర్ తానా నాలుగునెలలూ యెక్కడవున్నదీ యేమిచేసిందీ చెప్పలేదు. నేనేంచేస్తున్నదీ అడగడులే. గుచ్చి గుచ్చి అడుగుతాడని భయంగావుంది. కాని అడగలేదని బాధగానూవుంది.

వారంరోజులైన తరవాత గావును, బియ్యంకోసం అమీర్ వూళ్ళోకి వెళ్ళాడో లేదో, చెట్లవెనక వున్నాడో లేదో, మీరావచ్చి నాయెదుట తలవంచుకొని నించున్నాడు.

''మీరా, యిన్నాళ్ళేమైనావు?''

కళ్ళంబడి నీళ్ళు పెట్టుకున్నాడు.

"మీరా, ఎందుకోయ్, నాబాబూ!" "డీ, అంతా ఆఖరా?"

"ఏమిటి?"

నా కర్థమయింది. కాని అడిగాను.

"నీకు తెలీదూ?"

"ఏమిటోయ్ ఆమాట? ఏమీ ఆఖరుకాదు. నువ్వు వృత్తభ్రమపడు తున్నావు."

అంటున్నాను కాని, ఏదో మార్పు కలిగిందని నా హృదయం అరుస్తోనే వుంది.

"దీదీ, నే నీ బాధని భరించలేను. ఈ—"

"ఏమిటా బాధ ! ఎందుకని?"

"నాకు తెలీటంలేదు. చాలసార్లు ప్రశ్నించుకున్నాను అర్థంకాదు. కాని భరించలేను. మాట్లాడవేల ? ఈమూడు రోజులూ ఆ పొదవెనక కూచునివున్నాను—రాత్రింబవళ్ళు..."

పాపం !

"అయ్యో, మీరా, మూడు రోజులు అక్కడ వున్నావా? ఎందుకు రాలేదూ? పిచ్చితండ్రీ ! నిన్ను మరిచిపోయి, నేను నాఆనందంలోనే వున్నానా ? కాని నిన్ను మరిచిపోలేదు. దుర్మార్గురాల్ని. నిర్భాగ్యపు దాన్ని. ఏం చెయ్యను నీ బాధని తీర్చడానికి!"

నుంచుని అతన్ని నాపక్కన కూచోపెట్టుకుని, అతని తలని గట్టిగా కావిలించుకున్నాను.

"నేను నీకక్కర్లేదు. నిజం... కాదనకు... నేను చూస్తోనేవున్నాను. ...నీజీవితంలో నాకు స్థలంలేదు."

"మీరా, నువిట్లా అంటావని నేనెన్నడూ అనుకోలేదు. చూడు అమీర్‌తో నేను పూర్వంమల్లే ప్రేమగావున్నంతు కేనా నీకీబాధ; ఎందుకు వుండననుకున్నావు? వుండననీ ఎన్నడన్నా అన్నానా" "ఛా, నేననుకో

లేదు. దానికకాదు. కాని యీయింటోగాని, నహృదయంలోగాని నాకు చోటులేదు."

"వుంది ఎన్నటికీ పోవడానికి వీల్లేకండావుంది. నీకేమి సందేహం అక్ఖర్లేదు"

"నిజమా! నిజమా ?"

"నిజం. ఇంక పిచ్చి పిచ్చి సందేహాలతో బాధపడక రా, రా, ఆడుకుందాం. పువ్వులేరుకుందాం, రా."

అతన్నీ లేవదీసి, నవ్వించి, పరిగెత్తి, యిద్దరమూ తంగేడు పువ్వులు కోసుకుంటున్నాము. కాని నాహృదయం భారంతో మూలుగుతూనే వుంది.

"నాతలలో పెట్టు"

"అమీర్కి బావుండేందుకా?"

ఏంచెయ్యాను ?

"ఆమాటలే అనకు. ఇద్దరికీ బావుండేందుకే."

తల్లోపెట్టాడు పూలను.

మీరా తరహా మారింది. అతనివేళ్లు నా మెడమీద, జుట్టుకింద, చురుకు చురుకు మంటున్నాయి. పాముపిల్లకి యెంతపాలుపోస్తేనే యెప్పుడో ఒకప్పుడు పడగవిప్పకమానుతుందా? ఇలా గంటసేపు కాలం గడిపామో లేదో, అమీర్ వచ్చాడు.

"ఏం? మీరా? వచ్చావా?" అని లోపలికివెళ్ళా, పొయ్యిరాజేస్తున్నాడు, మళ్లీ మావేపురాక నవ్వుతో ఆవూరు వచ్చిన మందులవర్తకుడి కబుర్లు చెపుతున్న మీరా చప్పున ఆగాడు. అంతే కొంచెంసేపట్లో అమీరు వచ్చి కూచున్నతరవాత అనలే మాటలులేవు. ఆనిశ్శబ్దం దుర్భరమయింది. దూరంగాకూచుని అమీర్ అప్పుడప్పుడు రెప్పలకింద నించి దగ్గిరిగా కూచున్న మాయిద్దరివంకా చూస్తున్నాడు రాళ్ళలో ఆడుకుంటే తలెత్త లేదు. మీరా చివరికి, ఒక్కమాట మాట్లాడకుండా మీరా చప్పునలేచి వెళ్ళాడు. తరవాత రెండుగంటలసేపు మీరూ మాట్లాడలేదు.

ఏమిటా యీ వుపద్రవం, పెద్దతుఫానుముందట విపరీతమైన శాంతంకాదు కదా అని భయపడుతో నేను కూచున్నాను యెండవంక చూస్తో.

అమీర్ చప్పున

"ఆ 'దాదా' యేమిటి?" అన్నాడు.

"ఏమో నాకు తెలీదు."

"పిలిపించుకుంటో తెలీదేమిటి?"

"అది తెలుగూ కాదు, తురకంకాదు నాకుమాత్ర మెట్లాతెలుస్తుంది? ఏమో ముద్దుకి అట్లాపిలుస్తాడు"

"దాదా 'దాదా'" అని వెక్కిరింపుగా అని యింకా యేదో అనబోయి వూరుకున్నాడు అమీర్.

'దాదా' అన్నమాట మీరా నోట్లోంచి వొచ్చినప్పటి మాధుర్యమంతా చెడిపోయింది.

మళ్ళీ రెండు రోజులు మీరా కనపళ్ళేదు. అమీర్ కొత్తప్రేమలో, కొత్తకాంక్షలో అన్నీ మరిచిపోయినాను. కాని అమీరైనా, నన్ను కావిలించుకుని పడుకుని నా మొహంలోకి కళ్ళలోకి చూస్తో, యేదో స్పష్టంగాని తన సందేహాన్ని నాలోపల, నా హృదయంలోపల కళ్ళలోంచి వెతుకుతున్నట్లుగా చూస్తో పరధ్యానంలో పడతాడు. చప్పున మళ్లీ నా అందంలో మైమరుస్తాడు. ఏదో తనని బాధించే అంతశ్శత్రువులతో పోట్లాడుతున్నట్టు బాధపడతాడు. నాకతనిపైని, అతని బాధపైని యెంతో జాలి కలుగుతుంది కాని అడగడం భయం. అడిగితే యేం వెళ్ళపెడతాడో! మధ్యమధ్య మీరాని మరిచిపోయినానే! ఎక్కడున్నాడో? మళ్ళీ యే పొదలవెనక తిండిలేక మాడుతున్నాడో! రాడేం? అనుకుంటోనే మళ్ళా మరచిపోతాను. మళ్ళీ ఎందుకు మరిచిపోయినాను, ఎట్లా మరిచిపోయినాను? ఎంత క్రూరురాల్ని. నాకేం అధికారముంది యింత ఆనందంగా వుండేందుకు? అని నాలిక కొరుక్కుంటాను. కృతఘ్నురాలినా? నాసౌఖ్యం ముందు యింక యేభారాన్ని అణగతొక్కేస్తానా? నాగుండె విపరీ[illegible]న రాయా? ఏమో! కాని యిప్పుడు తలంచుకుంటే యేమనిపిస్తుం[illegible] —అంతకంటే యేంచెయ్యగలుగుదును? ఎటు

యేమి చేసినా, తోవలేని మహాగాఢమే. ఈజీవన నదికి యీమహా సముద్రమే అంతం—ఎటుప్రవహించినా అంతే. నాపుటక, నేను యేపరిస్థితులలో పడ్డానో అవి నాకర్మ, యీ ప్రపంచాన్ని పాలించే మహాశక్తి, మన హృదయాన్ని నడిపించే రహస్యసూత్రం, అదే, సత్యాన్నీ, అందాన్నీ, ప్రేమనీ, అన్నిటినీ, చిరునవ్వుతో, యిట్లా మా అల్పశక్తుల్ని, దాన్నించి తప్పించుకోవాలని చూసే మాఅల్ప వ్యర్థప్రయత్నాలని చూసి, చిరునవ్వుతో, క్రూరంగా, నిరాఘాటంగా, సునాయాసంగా యీడ్చేసింది. ఎవరు నలిగితేనేం, ఎంతయేడిస్తేనేం, తప్పని విధిగా, దొర్లించుకుంటూ పోయింది. దానికి కళ్ళులేవు, చెవులులేవు, ఆత్మలేదు. ఆశక్తే, నీతిలోంచి, జడత్వంలోంచి, శాంతిలోంచి మర్యాదలోంచి మిమ్మల్ని, పాపంలోంచి, నరకంలోంచి, మహాబాధలోంచి నన్నూ,-అందర్నీ, ఎక్కడికో, ఒకచోటికేనేమో, తీసుకుపోతోంది పూరికే మీరూనేనూ అట్లా చేశాం, యిట్లాచెయ్యకపోయినామే అని యేడుస్తాము. అంతే నామీద ఆగ్రహించి, తరుముతారు గాని, మీరు చెప్పేవేదాంతమూ అదేగా! చివరికి 'దానిఖర్మం పొమ్మంటారు' నేను 'మీఖర్మం, పొమ్మంటాను.

సాయంత్రం నేనూ అమీర్ యేటికి స్నానానికి వెడతోవుండగా దోవకడ్డంగా యెర్రని కండువాఅంచు పామువలె పడివుంది. అది మీరాది. దాన్నిచూడగానే కాళ్లు వొణికాయి మీరా చచ్చిపోయి, కండువా ముక్కని అక్కడ పారేసినట్టయింది. కాని వెంటనే అది నాకోసమే వుందని గ్రహించి, ఆగాను, ఆచుట్టుపక్కల పొదల్లోంచి,

'నువ్వు వొక్కతెవ్వూ వొచ్చిందాకా యిక్కడే వుంటా' ననిమీరా గొంతు వినపడ్డది. ఎంతకాలంనుంచి కాచుకుని వున్నాడో! ఎంతపొంగతనం వొచ్చింది నామీరాకి. అని యేడుపొచ్చింది. తలవూయించి అమీర్ వెనక నడిచాను.

చీకటిపడేసమయాన, పొయిమంటదగ్గిర అమీర్ని వొదిలి, వొక్కతెను యేటివొడ్డువైపు నడిచాను. మీరా వొచ్చి చీకట్లో పక్కన నుంచున్నాడు.

"ఏమిటి మీరా?"

"రా, దూరంగా, మాట్లాడదాం."

"వెంటనే వెళ్ళాలి అమీర్ వెతుకుతాడు."

"వెతకనీ అందుకనే దూరంగా వెడదాం"

"నన్నడుగుతాడు".

"భయపడుతున్నావు కద?"

"ఏమి?"

"నేను ముందే చెప్పలా, యిట్లా జరుగుతుందని అతనడగడం, దానికి నువ్వు భయపడడం, నాతో మాట్లాడ్డానికి వీలులేకపోవడం."

"అతనిదగ్గిర రహస్యం యెందుకు? వృథాగా అనుమానం కలిగించి యేంలాభం?"

"అనుమానమేమిటి? వీరాతో వెళ్ళాను ఏం?"

"కాని రహస్యంగా అతను వినకుండా. అతను చూడకుండా, మనకేముంది చెప్పు."

"ఏంలేకపోతేమాత్రం? ఏంలేదు కనకనే మనం వొంటరిగా వుంటేనేం"

"ఎందుకు వుండడం?"

"మరి నాతో మాట్లాడవా?"

"మాట్లాడనన్నానా? అక్కడేరా?"

"పోనీ, యిట్లా నాతోమాత్రం తిరగకూడదా?"

"అతనుకూడా వుంటేనేం?"

"వుండకపోతేనేం?"

నేను మాట్లాడలేదు. ఆసమస్య నాకర్థం కావటంలేదు. అమీర్ని చూస్తే భయమేస్తోందనే సంగతి చెప్పుకోడం యిష్టంలేదు.

"నీకిష్టంలేదనరాదూ?"

"వీరా!"

"పోనీ అతనికిష్టంలేదు నీకు భయమని ఆలోచించాను.

"వీరా, నీతో యెట్లా మాట్లాడాలో నాకు తెలీటంలేదు. ఏదో తప్పుపని చేసినవాడిమల్లే దొంగతనంగా దాక్కుంటావెందుకు? ఎందుకు

యింటికిరావూ? రా, మాట్లాడు, ఆడుకో, స్వేచ్ఛగావుండు, మాయిద్దరితో సఖ్యంగా వర్తించు, అందులో అమీర్, నీకు కొత్తవాడా? నాకన్న ముందు అతనేకదా, నీకుస్నేహం? కొత్తవాడా?

అప్పుడు నీతోనూ షికార్లువెస్తా? అతనితోనూ వెస్తా కాని మధ్య దోవలో పిలుస్తావేం? అక్కడికివెచ్చి, పిలవరాదూ? ఇప్పుడతను లేనిపోని అనుమానాలు పడతాడంటె అన్యాయమూ?

"అతనెవడు అనుమానాలు పడడానికి."

"ఎవడైతేనేం, పడతాడు."

"నువ్వు సహిస్తావు."

"నేను మాట్లాడలేదు."

"నువ్వక్కడికి ఎందుకురావు చెప్పు" అన్నాడు.

"నాకు బావుండదు. అతనికి బావుండదు. మనిద్దరమే వున్నట్టుండదు."

"అదికొత్త. అంతే నువ్వు నాలుగుసార్లు వొస్తే అదేఅలవాటువుతుంది."

అతను మాట్లాడలేదు. నామాటలు అబద్ధాలని నాఅంతరాత్మ అంటూనేవుంది. ఇద్దరిలో యెవరిని వొదలడానికీ చేతగాక, ఒక్కర్నీ వొదలకూడదనే పేరాసతో, ఆయిద్దర్నీ ప్రయత్నించి ఒకచోట చేర్చడం అనర్థకమంటోనే వుంది అంతరాత్మ, కాని నాశక్తిలోవుండేనా అహంభావం, నన్ను ప్రోత్సాహపరిచింది.

కాని అహంభావమేనా, స్వార్థమేనా? కాదేమో! అమీర్ మీద ప్రేమ, నేను లేకపోతే అమీర్ యేమైపోతాడో అనే అతనిమీదజాలి, నేను లేక మీరా బతకలేడే అనే అతనిమీదజాలి, నాహృదయంలోవుండే మార్దవంకాదా, అన్నిగతికి తీసుకొచ్చింది. నాకన్న కఠినాత్మురాలు, తన సౌఖ్యమే చూచుకునే దుర్మార్గురాలు, తనకువచ్చిన వాణ్ణి దరిచేర్చి, రెండో వాణ్ణి కఠినంగా వొదిలేశేది. సౌఖ్యంగానే బతుకుతుకదా! వాళ్ళిద్దరిలోకూడ ...న్నా సౌఖ్యపడేవారు. రెండోవారు మరిచిపోయి బతికేవారు. ఈగతి

రాదుకద. "తప్పదు, నువ్వు రావాలి. అమీర్ని నీతో స్నేహంగా వుండడం నా భారం. ముగ్గురమూ యెంతో ఆనందంగా వుందామని ఎంతో అనుకుంటే, చివరికి యిట్లా అయిపోయింది. అమీర్ తగాదా పెడతాడేమోనని భయపడ్డాను గాని, నువ్విట్లా అవుతావనుకోలేదు." అని కోపంగా అన్నాను. నా పెదిమలు వణకడం, అతన్ని లొంగతీశాయి, అతని భయాన్ని అణగతొక్కి సహజవివేకాన్ని అతన్ని కాపాడే 'ఇంస్టింక్టుని' నాశనంచేశాయి, పాపం ఏమీతోచక కళ్ళంబడి నీళ్లు పెట్టుకుంటూ నుంచున్నాడు. అమీర్ని నమ్మవద్దనీ, నామాటలు అబద్ధమనీ అతని అంతరాత్మ అంటూనేవుందికాబోలు. దుష్టురాల్ని నేను, నా సౌఖ్యంకోసం, అతన్ని బలవంతంగా లోబరుచుకున్నాను.—నామీరా!

పడమటి మెరుపు అతని మొహాన్ని వెలిగించింది. అప్పుడే ప్రారంభించిన గాలి అతని ముంగురుల్ని చీకట్లో వూయించింది.

"వెడతావా?"

"నువ్వో!"

"నేనింతే."

ఆ యెడారిలో, చీకట్లో, కీచుమనే శబ్దాలలో, ఒంటరిగా, నిస్సహాయం, బంధువలందర్నీ విడిచి, నాకై, పడివున్న, చిన్ని నా బాబును చూసి, నామనసు కరిగిపోయింది. దగ్గిరిగా, కావిలించుకున్నాను. "మీరా, మీరా, ఏదో విపరీతమైన బాధలో నువ్వు మాడిపోతున్నావు నాదగ్గిరికి రావు. నన్ను ఓదార్చనియ్యవు, ఏంచెయ్యనోయి నీకోసం?"

వెక్కివెక్కి యేడ్చాడు నామీరా! అమీర్ని వదిలేసి యితనితో వెళ్ళిపోనా అనిపించింది. పాపం, యీ లేతహృదయం, యీ అమాయకత్వం, నామీద విశ్వాసం, నామీద ఆధారపడడం, ప్రాణమన్నా నాకోసం యివ్వడానికి సిద్ధం. ఎట్లా ఓదార్చను అతన్ని!

"నీకోసం, యేంచెయ్యను? మీరా, నువ్వులేక, నేనెట్లా బతకను? ఎట్లా? నేనేం చెయ్యను?"

అని ఏడ్చారు. నాకన్నీళ్ళు ఆనని నిశ్చయాన్ని కరిగిస్తున్నాయి. నేనబద్ధం ఆడ్డం లేదు. మీరాని చూస్తే అట్లా నేవుంది నాకు. అప్పుడు స్వార్థం గావుందనా? నాకు తెలుసునా ఏంచెయ్యాలో? అంధకారంలో సముద్ర మధ్యలోవున్న నాటుక తీరమెటువుందో యెంత తెలుసో నాకంత తెలుసు కర్తవ్యం — మనమేంచెయ్యాలో తెలిపి, చెయ్యకపోతే శిక్షించవొచ్చు దేవుడు. కాని యింత అజ్ఞానం, అంధకారంలో వుంటాముకద! ఎంతయోచించినా తెలీదుకద! అంతాఐ, నాశనం చుట్టూ అల్లుకున్న తరవాత, యిల్లుకూలి నెత్తి మీద పడ్డతరవాత కాంతి వస్తుంది, దోవకనపడతుంది. ఏంలాభం? కాని నావంటిదానికి అప్పటికీ యిప్పటికీ, యెప్పటికీ తెలీదుదోవ! అసలు నువ్వేం పెకా సమస్యలో ప్రవేశించావు అంటారు పతివ్రతలు!

" అమీర్ని వొగిలెయ్యనా? వెళ్ళిపోదామా యిద్దరమూ ? "అన్నాను. నిజంగానే అన్నాను ఆమాటలు ఇప్పుడు తలుచుకుంటే, ఆ మాటలు అబద్ధంగాదా అని ఏడుస్తాను.

దాంతో, నా బాబు మనసు కరిగిపోయింది.

స్త్రీ త్యాగానికి ఆయత్తపడితే స్థిరుడైన పురుషుడు ఆ త్యాగలాభాన్ని స్వీకరించ గలడా ? ఆ మాట చాలు. తన కోసం త్యాగంచేసే స్త్రీ వుండడం పురుషుడికి అమితమైన ఆత్మవిశ్వాసాన్నియ్యాలి. కాని త్యాగాలు గ్రహించడానికి అలవాటుబడ్డ పురుషుడు అతి నీచుడు. పతివ్రతల త్యాగాల ... లు నిలబెట్టుకునే గతి మీ పురాణ ధీరులకే గాని: అమీర్ కి

... డీ దీ రేపణ్ణించి "

...స్తావా ? నాపిచ్చి బాబూ, పూరికే భయపడ్డావు.

యింటివైపు చూశాము " కాని డీడీ ఇదివరకుమల్లేనే నీ ... నీ బుజంమీద చెయ్యి వేస్తా "

...ండా. ఎందుకుఅడుగుతావు? "

• అమీర్ — చూస్తున్నా — "

...ం?"

అంటున్నానుగాని నా గొంతుకలో అబద్ధం వినిపించలేదా నీకు, మీరా? నాబింకంకొద్దీ, అన్నాను. కాని నాగుండె నీరైపోతోంది. ఏం జరుగుతుందో. కాని ఫరవాలేదు. అనుకుంటూ పక్కకి చూశాను మీరా లేదు. ఇంటికి వెళ్ళాను.

మర్నాడు మీరా వొచ్చేప్పటికి అమీర్ నాతల చిక్కుతీస్తున్నాడు. మీరా తరహా మార్చాడు. రావడమే ఆదేదో అసహజమైన సాహసంతో వుత్సాహంతో వచ్చి, నాకెదురుగా కూచుని, నిర్లక్ష్యమైన కంఠంతో

“ నేనిచ్చిన దువ్వెన్న యేది, దీదీ ! ” అన్నాడు, పాపం పూర్వం వలె మాట్లాడడానికి ప్రయత్నమది.

“ ఇంకెందుకు ? అమీర్ వొచ్చాడుగా చిక్కుతియ్యడానికి. చిక్కు తీసుకుని మాత్రం ఏం ప్రయోజనం? ” అన్నాను అమీరువంక చిరునవ్వుతో చూసి. మళ్ళీ మీరా వంక చూసి నవ్వాను. నా పని యెట్లావుం దనుకున్నావు ? రెండు మహా సముద్రాలమధ్య సన్నని తాడుమీద నడుస్తున్నట్టుంది. ఏమాట మాట్లాడితే ఏంమాట్లాడకుండా వూరుకుంటే, ఏచూపు చూస్తే ఎవరికి కోపం తెప్పిస్తానో, ఏమగ్రం చేసుకుంటారో ! అబ్బా ! ఆ రోజుల యమబాధ ! ప్రేమ యింత ప్రాణం తీస్తుందని అనుకోలేదు. కత్తిమీద సాము కద !

అమీర్ గంభీరంగా నాజుట్టువంక చూస్తో వూరుకున్నాడు.
మీరా ఇవీ అవీ గబగబా మాట్లాడుతున్నాడు. ...నో
డాన్ని గురించి అనుకుంటున్నవీ, ఆస్టేషనులో వె... ...న
అగ్గిపెట్టడం అన్నీ చెప్పాడు.

అమీరు వెదలగానే వెళ్లి మీరా పక్కన కూచు...
కత్తికి పదును పెడుతో, ఆపనిలో నిమగ్నుడై వున్నాడు, ...
దగ్గిరికి జరుగుతాడేమోనని నాకు భయంగానే వుంది, ...
అమీర్ భయంకరమైన కళ్ళు ముందుపెట్టుకుని మీరావు...
నేనింక ఆ నిశ్శబ్దం భరించలేక లేచాను. ...

“స్నానానికి వెడదాం.” ...ని

ఎవరూ లేచలేదు.

"మీరా నువ్వురా"

మీరా చప్పననందుకొని, అమీర్ మొహంవంక చూస్తున్నాడు.

"అమీర్, నువ్వు కదలవేం?"

కొంచెం మాట్లాడకుండా ఊరుకొని

"ప్రస్తాపదండి."

అన్నాడు. కత్తిమీదే ధ్యానముంచుకుని, ఇంకేం మాట్లాడానికీ తోచక, బైటికి నడిచాము. ఎంతదూరంపోయినా అమీర్ జాడలేదు. ఎత్తుగా పెరిగిన చెట్టు తంగేడుకింద ఆగి యెండలో మాడుతున్న గుడిశ వంక చూస్తో మాట్లాడకుండా నుంచున్నాను. చప్పన మీరా.

"లాభంలేదు, డీదీ." అని ఊరుకున్నాడు. నేనూ మాట్లాడలేదు.

"అమీరక్కడవుండగా నీతో చనువుగా వుండలేను. నాచాత కాదు." అన్నాడు నేనేమనను?

"పోనీ, తాకక్కపోతేనేం మీరా, చనువుగా వుండకపోతేనేం?"

మీరా కొంచెంసేపు ఆలోచించాడు.

"అవును, తాకక్కపోతేనేం? నీకేం?" అని సన్నగా అన్నాడు.

ఆ! నీకేం? అన్నమాట, అతని కంఠం, నిరాశ, శూలాలవలె నాటుకున్నాయి.

"అన్యాయం. మీరా, నువ్వు నన్నట్లా అనడం, ఇంకా తెలుసుకోలేకపోయినావుకద, నామనసెటువంటిదో! మనకున్నటువంటి ప్రేమకి తాకడం అవసరమా?" మళ్ళీ ఆలోచించాడు. పాపం. ఆ చిన్నవయస్సులో యీ సమస్యలు, అర్థంగాని యీబాధలు, యివన్నీ ఆలోచించి, చెప్పుకోవలిసిన గతిపట్టింది మీరాకి.

~~మీరా [illegible]~~

కూచున్నాను. మళ్ళీ నిశ్శబ్దం మొదట భరించలేక అన్నం తిందాం అన్నాను. తనని పొమ్మన్నానన్నట్టు మీరా లేచాడు. నా తప్పు సవరించు కోడానికి.

"మీరా, నువ్వూ రా, అన్నానికి." అన్నాను. అన్నానో లేదో, నా అవివేకం మనసుకి తట్టింది. ఒకటే మూకుడు దాంట్లో నేనూ అమీర్ తిన్నాము. తరవాత రోజుల్లో దాంట్లోనే నేనూ మీరా తిన్నాము. ఇప్పుడు మళ్ళీ నేనూ అమీర్ తింటున్నాము. ఆ మూకుడుకన్న యింకేమీ లేదు యింట్లో. ఇప్పుడేం చెయ్యను? వెర్రిగా నుంచున్నాను. ఇద్దరూ నాకేసి చూస్తున్నారు.

"రండి, ముగ్గురమూ తిందాం" అన్నాను. అమీర్ కదలడు; మీరా కదలడు. ఎంతసేపు నుంచున్నానో! నా కళ్ళు తిరుగుతున్నాయి. నాతల్లో ఒక్క ఆలోచనా లేదు. చప్పున నా స్త్రీత్వాన్ని ప్రయోగించి నవ్వు చిమ్ముతో—

"మీ యిద్దరూ పిల్లలంట్లో నేను కలిపిపెడతాను. ఏం?"

అని వాళ్ళవంకన్నా చూడక, వెళ్లి అన్నమూ, దోసకాయపచ్చడి కలిపి తీసుకొచ్చాను.

"ముందుముద్ద నాదీ. తరవాత అమీర్

నువ్వూ!"

"నేను తరవాత తింటానులే" అని కన్నా యెత్తక విసిరాడు మాటల్ని అమీర్.

అవజయంతో గుటకలుమింగాను.

'నువ్వన్నా నామాటవినవా?' అన్నట్టు కళ్లు అతనిమొహంకేసి ఎత్తి, ముద్ద నోట్లో పెట్టాను. అతనితో మధ్యమధ్య నాలుగుముద్దలు నేనూ తిన్నాను. తరవాత అమీర్ దగ్గిరికి వొచ్చాను.

"అక్కడపెట్టు" అన్నాడు కఠినంగా

తింటున్నాడు,

"నువ్వూ తిను." అన్నాడు.

తింటున్నాను.

"చూశావా? ఏగ్లాను నేను వేరే!" అన్నట్టు చూస్తున్నాయి మీరా కళ్ళు.

మూకుడింట్లో పారేసి వచ్చి బైట కూచున్నాను. ఇంకా మీరా వెళ్ళడేమో, వాడికిక్కడేమిపని అన్నట్టు తలెత్తి చూస్తాడు, అమీర వస్తాడప్పుడు, మీరా మూనరాగం తీస్తా కూచున్నాడు. కాని ఆరాగం రావడానికి యెంత ప్రయత్నం లోపల జరుగుతోందో నా కర్థమవుతోనే వుంది. నీడలతోపాటు అమీర్ ముఖంమీద క్రోధపు నీడలుకూడా దట్టమవుతున్నాయి.

"చెట్టుకింద కూచుందాం" అన్నానో లేదో మీరా తనువడకానని లేవబోయినాడు, ఏమనుకుంటున్నాడో అనుకొని,

'అప్పుడేనా! కూచో' అని కూచోపెట్టాను. అమీర్ తలెత్తి నా వంక చూశాడు. ఏదో కనిపెట్టే వాడివలె, కాని మీరాని యింతాపిలిచి, రమ్మని నిరాశపెట్టి, ఏడిపించి పంపుతున్నానని నాకు దిగులేసింది, కావలిసి. మీరా భుజంమీద చెయ్యివేశాను. పదినిమిషాల్లో అమీర్ లేచి వెళ్ళాడు. మీరా నిద్రపోయినాడు. నేను అట్లానే యోచిస్తో దిగులుగా కూచున్నాను అట్లానే నాకళ్ళముందే రాత్రయింది నేలమీద నాముందు పడి నిద్రపోతున్న నాబాబు, నా నవాబుని చూసి, నాకు ఊరికే దిగులు వేస్తోంది. అమీరెక్కడ వున్నాడో, యేయే కోపాలతో మండిపోతున్నాడో! యేయే నిశ్చయాలతో పోట్లాడుకుంటున్నాడో, పాపం, ఆతనిమీద నాకు ప్రేమపోయిందని యెంత బాధపడుతున్నాడో, యెట్లా అతనికి నాహృదయం అంతా అతనిదేనని తెలియచెయ్యడం? అతనిదేనా? చెట్ల ఆకులు మెల్లిగా ఊగుతున్నాయి. పడమటిచంద్రుడు ఉదయించి అప్పుడే అస్తమిస్తున్నాడు. రెక్కలు కొట్టుకుంటో చిన్నపిట్టలు యెగిరి మాయమవుతున్నాయి. వాటి కర్థమవుతుందా నాబాధ, నా నిరాశ! ఆరాత్రి అనిపించింది యీ మీరానించి, యీ అమీర్నించి యీ మైదానం నించి తప్పించుకుని, బైటపడగలిగితే! ఎక్కడకి? ఇక్కడికి! ఒకటే శరణ్యం. ఆ నల్లనిరాత్రి నా ప్రాణాలని, నన్ని, నా యెదుకడుపులో దాచుకోనా?

"దీదీ, దీదీ!"

కలవరిస్తున్నాడు, నా చిన్నిబాబు!

నా బాబూ, మీరా, నిన్నేం చేస్తానో కదా! నీకేగతిరాశివుందో నేను బతికివుంటే నీకే ఆపద రాకమానదు. నేను కాళిని నీప్రాణం తీసుకుంటా! నన్ను వదిలిపోరాదా? కృతఘ్నురాలినిగా కనపడే ధైర్యంలేక, నిన్ను నావెంట యీడ్చుకొంటున్నా. నిన్ను తోయ్యలేక, నాతో అగాధానికి నిన్నూ లాక్కుపోతున్నాను.

"మీరా, నేను అమీరుదాన్ని. నువ్వు నాకక్కర్లేదని పంపితే! అప్పుడే నిజంగా నీప్రాణాలు రక్షించుకుంటూ, నిజంగా నీ దీదీనౌతాను! ఆమాట అనగలనా? నాగుండె రక్తంకారి, నిన్ను పిలిచి నామాటలబద్ధమని చెప్పదా

"దీదీ!"

మీరా లేచాడు.

"దీదీ, దీ, దీ, వున్నావా? నువ్వు చచ్చిపోయినట్టు కలవొచ్చింది."

నా మోకాళ్ళు కావిలించుకొన్నాడు

"దీదీ. నిజంగా మాయిద్దరిమధ్యా యీబాధ పడలేక నువ్వు చచ్చిపోవుకద!"

నా బాధంతా, యీ యిద్దరినీ సంతోషపెట్టడానికి నేను చేస్తున్న బ్రహ్మప్రయత్నమంతా జ్ఞాపకంవచ్చి, యేడ్చాను, గబగబ నోడ్చేశాను. నాబాబు, నామీరా, యెన్నోవిధాల నన్నోదార్చాడు,

"నేనింక ఎన్నడూ కనపడను. వెళ్లిపోతా, నువ్వు సుఖంగావుండు"

"అయ్యో, నిన్ను వొదలగలిగితే, యింతక్షోభ యెందుకు?"

"నిజంగానేనా? నిజంగానేనా? నాకోసం, నామీద జాలిపడి కాదుకదా, నన్ను పొమ్మనక పోవడం? నీకోసమేనా?

ఇంక ఏంకానీ, నాగొంతులో ఊపిరి వున్నంతవరకు నిన్ను వొదలను.'

నామెడ కావిలించుకున్నాడు.

నక్షత్రమొకటి కిందికి జారింది. వెంటనే వొస్తానని మీరా వూళ్ళోకి వెళ్ళాడు. అమీర్ వొచ్చి మాట్లాడకండా కూచున్నాడు. పొద్దుటి అన్నమే తిన్నాం. నేను అమీర్ దగ్గిర కూచుని కబుర్లు చెపుతున్నాను. నా హృదయానికి కొంచెం విశ్రాంతి కలిగింది. మీరా రాలేదు. వొస్తాడేమోనని భయంగావుంది. నక్కగాని కుంగేలుగాని చీకట్లో చప్పుడు చేసినప్పుడల్లా వులికిపడి చూస్తున్నాను. అమీర్ కనిపెట్టాడు గావునను కుంటా.

"రా, తిరుగుదాం"

మీరా వొచ్చి వెతుక్కుంటాడేమోనని దిగులుగానే వుందిగాని, హృదయంమాత్రం యింకా విశ్రాంతి కావాలని కోరుతోంది. బైలుదేరాను.

చీకటి కటికచీకటి. అమీర్ బుజంమీదనించి, మెడమీదనించి, చెయ్యివేసి, నాశరీరమంతా అతనిమీద ఆనించి, మోకాళ్ళవరకు రాసుకునే చెట్లలో, గడ్డిలో, రాళ్ళలో, యిసికలో, నడుస్తున్నాము. అంతులేని ఆకాశంలో, గుర్తులేని లోకంలో, ఏమీ కనపడని అంధకారగర్భంలో యిద్దరమూ, దగ్గిరిగా హృదయాలు కొట్టుకుంటో తిరుగుతున్నాము! ఎంత సేపో! అమీర్నానుకుని, అతని చేతికింద సమస్తమూ, నా బాధలు, నా సందేహాలు, భయాలు, అన్నీ మరిచి, ఆ రాత్రిలో కలిసిపోయినాను.

ఎట్లాగో అతనిముందు నాహృదయాన్ని విప్పి అర్థం చేయించి నాతో సానుభూతిని చూపెట్టు చేస్తే! వెర్రికలలు అంత దగ్గిరిగా నడుస్తున్నాము. ఒకరికి యింకోరు ప్రాణతుల్యులు. కాని ఒకరిసంగతి యింకోరం అర్థంచేసుకోము. అతని సంగతి తెలిసికూడా నేను అశక్తురాల్ని, నాసంగతి తెలుసుకోలేక అతను అశక్తుడు. ఎందుకిట్లా పుట్టామో!

అప్రయత్నంగా, మామూలుతోవనే మాకు తెలీకండానే మా కాళ్లు మమ్మల్ని కొండమీదికి తీసుక వెళ్ళాయి. అటువెళ్ళి మాపాత బురుజు చివరకూచునికాని రాము. ఎంత చీకట్లోనైనా అమీర్కి తోవ తెలుసు. కళ్లుకట్టుకుని ఆ సన్న గోడమీద నడిచి వెనక్కి రాగలడు. గోడదగ్గిరిగా వొచ్చామో లేదో, ఏదో గోడమీదనించి కిందికి జరజర జారిన చప్పుడయింది.

"ఏమో, పశువో, లేక తోడేలో?
పాపం. చస్తుంది కాదూ?"

ఆ మాట వుండగానే నా కంఠస్వరంలో కలిసి, కెవ్వన కేక విన పడ్డది, "దీదీ!" అని

మీరా! మీరా పడ్డావా, ఆ అగాధంలో. వెర్రెత్తలేక పరిగెత్తాను నేను.

'మీరా, మీరా, నామీరా'

ఇంకేం మీరా వున్నాడు? ఎందుకు అరిచావు? లాభమేమిటి? కొండలన్నీ మీరా, నామీరా, అని వెక్కిరించాయి.

కాని అద్భుతంగా ఆ అగాధంలోంచి హీనస్వరం.

'దీదీ' అంది.

నా చెవులు నన్ను మోసగించాయా, లేక పదన్నా భూతం నన్ను వెక్కిరిస్తోందా? లేక అతని ఆత్మ అరిచిందా? ఆ అగాధంలోకి తొంగి చూస్తున్నాను గావును అమీర్ చెయ్యి నా కంఠాన్ని వెనక్కిలాగింది.

"పడతావు. వొంగకు."

అమీర్ పాపం నా వెనకనే వున్నాడు,

"అమీర్, అమీర్, మీరా, నామీరా. నామీరా"

"మళ్లీ పిలు!"

అతకోపమేనా! దడిపిస్తున్నాడా? పిలు ఏం చేస్తావో అన్నాడా? నాకు వెర్రి తెలీలేదు.

"అమీర్! బతికి వున్నాడు. బతికే వున్నాడు. ఎట్లా! అయ్యో మీరా! నేనింక బతకను. ఎట్లా బతకను." మీరా లేందే? నాలిక కొరుక్కున్నాను ఆమాటన్నందుకు. అమీరేం చేస్తాడు?

సరే నీమీరా దగ్గిరికే పొమ్మని మెడపట్టుకు తోస్తాడా?

"మళ్ళీ పిలు"

"మీరా!"

"దీదీ!"

"వున్నాడు బతికేవున్నాడు...అమీర్ ఏంచేస్తున్నావు?"

"వుండు...ఎక్కడవున్నాడో అడుగు."

"మీరా ఎక్కడవున్నావు?"

"దీదీ, శెలవు ఈమధ్యలో చెట్టునిపట్టుకుని వేళ్లాడుతున్నాను. నా చేతులు యింక ఆగవు పడిపోతున్నాను. దీదీ, నువ్వు గొప్పదానివి. నిన్ను చూస్తే...నీకోసం నాప్రాణమన్నా యిచ్చేసేవాణ్ణి నువ్వుయింటిదగ్గర వుంటానన్నావా? లేవు. అందుకని పెత్తుక్కుంటాం..."

వినలేకపోయినాను. మీరాని మరిచి అమీర్తోవొచ్చినందుకే! నాకోసమే!

మీరా యిట్లాయిపోయినాడు, నాకోసమే! నామీరాని చంపుతున్నాను. అయ్యో! నేనూ దూకిచస్తే! (మీరా, నామీరా! నేనూ వొస్తాను. మీరా నేనూ చస్తా!

ఆ అగాథంలోంచి, ఆచీకట్లోంచి. చెట్లగుబుర్లలోంచి, ముళ్ళల్లోంచి వినిపిస్తోంది వినిపిస్తోంది, వుదారుడైన నామీరావాణి.

"దీదీ! అమీర్ మీదనే నీప్రేమ. అమీరే నీకు కావాలి. నేనఖ్ఖర్లేదని నాకుతెలుసు. నేను చావడమే మంచిది"

"ఆగు రెండు నిమిషాలట్లానే ఆగు."

ఎవరదది? అమీర్ కంఠం

"నా చేతులు పీక్కుపోతున్నాయి. దీదీ, శెలవు."

"వదలకు వొస్తున్నాను."

చీకట్లో నా కాళ్ళకిందనించి అమీర్ మాట్లాడుతున్నాడు. కిందకి దిగుతూ, అగాథంలోకి దూకాడు అమీర్, నా ధీరుడు, నా మీరాకోసం

ఎట్లాగడిపానో ఆ నిముషాలు. అమీర్కోసం భయం. నా మీరాకోసం ఆదుర్దా"

ఆ అగాంధకందరంలోయేం జరుగుతోందో తెలీదు. పిలిస్తే మాట్లాడితే వాళ్ళకేం అపాయం కలుగుతుందో.

అమీర్ మీద నాకు నమ్మకం లేదు. ఎట్లా లేకపోయిందో అనుకుంటాను. నా అమీర్ నీచమైనపని చేస్తాడా? ఏమో-నీమరాల్ని సందేహించాను మీరాని రక్షించడానికే వెళ్ళాడా? తన చేతులతో చంపి లేనగాని కసితీరకనా? ఇద్దరూ జారిపడి ఒక్కరూ పైకిరాకపోతే ఆ చీకట్లోంచి!

మెల్లిగా తీసుకొచ్చాడు, ఆ అగాధంలోంచి మొహం వేళ్ళాడిపోయిన మీరాని!

"అమీర్!"

"ముందు వాడిసంగతి చూడు"

మీరాని కావలించుకోవాలని ముందుకి వంగాను కాని అమీర్ చేసిన త్యాగంతో మూర్ఛపడివున్న నా హృదయం అమీర్ని చూసి జంకింది.

"దీదీ!"

నామీరా!

# 10

"వెన్నెల యీవాళ పన్నెండుగంటకే పోతుంది. మనం తొందరగా వెళ్ళాలి భోజనం చేద్దాం" అన్నాడు అమీర్.

"అయ్యో! మీరుపిలిచిన పనిమనిషి బ్రాహ్మణులా యింకా రాకుండానే మడికట్టుకుంటారా?" అని పూర్వపు వుల్లాసం తెచ్చుకోడానికి ప్రయత్నించాను.

"ఆ అమాంసపూరక దగ్గరిపోతాని"

"మిగిలిందే పెట్టు వాళ్ళకి."

"పోనీలెండి మూతపెట్టిపోదాం. వచ్చి వడ్డించుకుంటారు." అని నవ్వుతూ లేవబోతున్నాము. మీరావొచ్చాడు.

ఆ సమయంవెళ్ళిన మీరా మళ్ళీ యిదే రావడం.

నాసంక చూస్తున్నాను. చీకటిని చీల్చుకొని, అతని చూపులు నన్ను పరీక్షిస్తున్నాయి, వెతుకుతున్నాయి, అర్థంచేసుకుంటున్నాయి. అతని నిశ్వాసం, అతని నిశ్శబ్దం, అతని అడుగులతొందర, అతనిచేతుల [illegible]లన్నీ మాట్లాడుతున్నాయి. నాతల తిరుగుతోంది. అలసటవలన నా[illegible] మూతలుపడుతున్నాయి, నా హృదయం యింక బాధపడలేనని మూలుగు తోంది, నా అడుగులు తూలుతున్నాయి, మీరా ఏమిటో మాట్లాడు తున్నాడు కాని నేను వినలేదో, వింటే మరిచిపోయినానో! ఏవేవో మాటలన్నాడు దోవపొడుగూతా.

"నేనింక వూరుకోను. నిన్ను చూడకుండా వుండగలనా? నాకు కన పడకుండా తీసుకుపోతాడు నిన్ను! నాకుతెలుసు. నిన్ను చంపుతాడు నాకు కాకుండా. నువ్వు నాదానివి. నేనవరికీయ్యను చూస్తో నేనూరుకోను. నిశ్చయం రా నాతో రా. నాజీవితమంతా నీసేవలోనే గడుపుతా. ఎక్కడి కేమిటి? ఎక్కడికన్నాను! మెక్కాకి, బనారసుకి, లాహోరు, హైదరాం. ఎక్కడికైతేనేం, నువ్వూ నేను కలిసివుంటేచాలదా? ప్రొద్దూటికి తిరుగుదాం బిచ్చమెత్తుకుందాం వాడిదగ్గిర్నించి, ఆ రాక్షసిదగ్గిర్నించి, ఆ[illegible] దగ్గిర్నించి తప్పించుకుంటేచాలు. వాడు నిన్నింక తాకడానికి వీల్లేకుండా పోదాం. నా దీదీని అల్లాయేకించి, అల్లా నలిపేసి, [illegible], నేనోర్చుకో లేను. నేనూరుకోను. నాదానివి నన్నొదిలి పదకు. నన్ను చంపకు....... దానివి. నాదానివే..."

అంటూ నన్ను పనకదుముకుంటున్నాడు.

"వుండు, మీరా, ఎక్కడికియింకా"?

"దీదీ, దీదీ, రా...నువ్వు నాదానివి—నాదానివి· రా"

నన్ను కావిలించుకుని, ఆక్రమించుకుంటున్నాడు. నాకాళ్ళు చీకట్లో మెలికలు పడుతున్నాయి.

"వ్రేళ్ళు' మీరా, యింక రాను—వుండు— నాకు నిద్రవస్తోంది"

ముందుకు లాగాడు. నేను తూలాను. కాళ్ళతొక్కుడుని నేను కింద పడ్డాను, సగం యిసికలో, సగం నీళ్ళలో. ఎక్కడో! చీకటి: నిద—

అలసట. ఇంక నడవనక్కర్లేదు. అంతే చాలు, నాపక్కనే, సగం నామీద. సగం నాపక్కన మీరా పడ్డాడు. అతనిమీద ఒక చెయ్యి వేసుకుని కళ్ళు మూసుకున్నాను"

"లే, వెడదాం, లే"

"ఎక్కడికి మీరా?"

"ఎక్కడికో"

"నేను రాలేను. నేను రాను. వుండు. నాకు నిద్రవొస్తోంది."

"రాత్రా, రావూ, ఇంకా నా దగ్గిర వుంటావా! నేను వుండనిస్తానా? నా దానివి."

ఇది మీరాయేనా?

నాకు తెలీదు. నాకు శక్తి లేదు. మీరా మాట్లాడుతున్నాడు. మీరా నన్ను లోబరచుకుంటున్నాడు.

"వాడేనా? వాడిదానివేనా నువ్వు? ప్రాణం, సంపాయించాను పాపం, మొన్ననేగా తననీ అమీర్ మృత్యువునించి రక్షించాడని అది కూడా మరిచాడు కదా మీరా? అప్పుడు మరిచాను, కాని ఆ సంగతి యిప్పుడు యోచిస్తున్నాను. ఎంతతపనలో కమలకపోతే, కృతజ్ఞతని కూడా మరుస్తాడు, ఉదారుడు నా మీరా! తక్కిన విషయాల్లో ప్రాణానికి ప్రాణ మిస్తారు. స్త్రీ విషయంలో ప్రాణానికి ప్రాణం తీసుకుంటారు"

దీదీ, దీదీ, నాదీదీ, రా. ఇల్లారా? నీకోసం, యీ పెదిమలకోసం యీ చేతులకోసం—

ఆ రాత్రి, ఆ నీళ్ళలో, యిసికలో, నీడల్లో—మీరా నన్ను తనదాన్ని చేసుకున్నాడు.

అతనికి మనసునొప్పించే శక్తిగాని, అతనిమీద అధికారం చేసే శక్తి గాని, నాకు లేదు.

ఎంతసేపయిందో, తెలీదు. కారణంలేకుండానే నాకు తెలివి కలిగింది. మీరా నామీద పడుకొని వున్నాడు. అతని జుట్టు నా మొహంమీద పడ్డది. అతని చేతులు నావీపుకింద వెంచి, యిసికలో పాతుకున్నాయి.

అమీర్ చేసిన గాయంమీద మీరా నొక్కిపెట్టాడు. [illegible] నాకళ్ళు విప్పిందే-ఆదే చీకట్లో బాగా కళ్ళువిప్పి చూశేట్టు చేసింది.

మాపక్కనే నల్లని ఆకారం.

అమీర్ కళ్ళు.

చేతుల్లో తళతళలాడే కత్తి! మా యిద్దరిమీదా అది దిగుతుందని తెలిసి కళ్లుమూసుకోబోతున్నాను—జుట్టుపట్టుకుని మీరా లాగాడు. నా మీరాతో సగం ప్రాణం హడలిపోయింది. పిల్లి పిచుకలాగు కీచుమన్నాడు మీరా! చప్పున లేచి, అట్లానే మీరాకూ అమీర్ కత్తికి అడ్డుపడ్డాను. నా బలువుతో మీరాకింద యిసికలో దొర్లాము

"వాణ్ణి వొదులు" అంది అమీర్ గొంతు గుసగుసగా!

"నన్ను చంపి తరవాత—"

"నిజమా—"

"నిజం"

"సరే"

కదలిక మీరాని వైపేక కనపడక, నా గొమ్ములో, నా జుట్టులో తొడలతో కప్పేశాను. ఎదురుచూస్తున్నా, కత్తి నామీద దిగుతుందని చప్పున నిష్కారణంగా, నా ప్లీడరుగారూ, యిల్లూ, నా పుస్తకాలూ కళ్ళ ముందుకి వొచ్చాయి.

నిశ్శబ్దం. పది నిమిషాలన్నా జరిగివుండాలి. కళ్ళు తెరిచాను. ఎవరూ లేరు లేచాను. ఇసికలో జిగురుగా కాలికి తగిలింది. రక్తం పక్కన అమీర్ పడివున్నాడు.

"అమీర్" అన్నాడు మీరా!

1 వ పేజీ నుంచి 40 వ పేజీ వరకు

బెజవాడ ఆంధ్ర వాణీప్రెస్ నందును

మిగతా పుస్తకమంతయు

తెనాలి లక్ష్మి ప్రెస్ నందు ముద్రింపఁబడియె.



# మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA116B151 |
| పుస్తకం పేరు | శైదావం |
| తారీఖు | 26/10/24 |
| ముందు అట్ట | no |
| వెనుక అట్ట | no |
| మొత్తం పేజీలు | 105 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | ll ... |
| లేని పేజీలు | 105,106 ,45,46,99,100 |
| తయారు చేసినవారు | Rohith |
| పేజీలు విడదీసినవారు | Sowmya |
| స్కాన్ చేసినవారు | Mounika |
| పరీక్ష చేసినవారు | prathyusha |
| పేజీలు సరిచూసినవారు | |
| బైండింగు చేసినవారు | |
| ప్యాకింగు చేసినవారు | |
| పరిస్థితి | good |